# వాగ్గేయకారులు-
# పదకృతి సాహిత్యం

పుట్టపర్తి నారాయణాచార్యులు

ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున ప్రచురితము

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

ప్రచురణ నెం. 23
ఏప్రిల్, 1975

ముద్రణ :
నాట్యకళ ప్రెస్
హైదరాబాదు-500004.

వెల : రెండు రూపాయలు

ముఖచిత్రం : వడ్లు శ్రీనివాసశర్మ

ప్రతులకు
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ
కళాభవన్, హైదరాబాదు-500004

# పరిచయము

ఇరువై శతాబ్దాల తెలుగు చరిత్ర సంస్కృతి పునాదులపైన నిర్మింపబడ్డ తెలుగు జాతి సమైక్యతను సర్వతోముఖాభివృద్ధిని పటిష్ఠం చేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆధ్వర్యంలో రాక్షసనామ సంవత్సర ఉగాది (1975 ఏప్రిల్ 12వ తేదీ) నుండి వారం రోజులపాటు ప్రపంచ తెలుగు మహాసభలు జరుగుతున్నవి. ఈ మహాసభల ఏర్పాట్లకుగాను ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు అధ్యక్షులుగాను, విద్యాశాఖ మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణరావుగారు నిర్వాహకాధ్యక్షులుగాను ఒక సంఘం ఏర్పడింది. ఈ సందర్భంగా 1975 సంవత్సరాన్ని తెలుగు సాంస్కృతిక సంవత్సరంగా పరిగణించడం జరుగుతున్నది.

ప్రపంచ మహాసభలకు నాందిగా రాష్ట్రంలోని పలు ప్రదేశాలలోను, ఢిల్లీలోను సంగీత, నాటక, నృత్య, జానపద కళోత్సవాలను నిర్వహించే బాధ్యతను, ఆయా కళారంగాలకు సంబంధించిన గ్రంథాలను ప్రచురించే బాధ్యతను స్వీకరించవలసిందని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీని ప్రపంచ తెలుగు మహాసభల కార్యవర్గం కోరింది. ఈ కార్యక్రమం క్రింద అకాడమీ విజయవాడలో నాటకోత్సవాన్ని, అనంతపురంలో వీధినాటకం సదస్సును, నిజామాబాద్‌లో నృత్యోత్సవాన్ని, తిరుపతిలో సంగీతోత్సవాన్ని ఢిల్లీలో ఆంధ్రప్రదేశ్ జానపద, నాటక కళోత్సవాన్ని నిర్వహించింది.

ఈ సందర్భంలో సంగీత, నృత్య, నాటక, చలనచిత్రాలకు సంబంధించిన గ్రంథాలను ప్రచురించే అవకాశం కల్పించి, అకాడమీ గ్రంథ ప్రచురణ కార్యక్రమానికి ప్రపంచ తెలుగు మహాసభల కార్యవర్గం దోహదం చేసింది. అందుకు వారికి మేమెంతో కృతజ్ఞులం. ఈ అవకాశాన్ని పురస్కరించుకొని ప్రచురించిన అనేక గ్రంథాలలో ఈ "వాగ్గేయకారులు-పదకృతి సాహిత్యం" ఒకటి. ఈ గ్రంథాన్ని రచించిన ప్రఖ్యాత కవిపండితులు "సరస్వతీ పుత్ర" బిరుదాంకితులు పుట్టపర్తి నారాయణాచార్యులు గారికి మా ధన్యవాదాలు.

జె. బాపురెడ్డి
స్పెషల్ ఆఫీసర్
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ.

# ముందు మాట

ఎన్నో ఏళ్లుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వ సమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధుల నందరినీ ఒకచోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది రెండు వేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలంనుంచి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదు కోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడే వారి తరువాతి స్థానం తెలుగువారిదే. బౌద్ధపూర్వయుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్యపరిపాలనా యుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్లడం జరిగింది. అట్లా వెళ్లిన తెలుగువారు తమ భాషా సంస్కృతీ సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తూఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికి, తద్వారా

వివిధ చైతన్యస్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహాసభలు దోహదకారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు ఆర్ద్రమైన భావసమైక్యతకు ప్రాతిపదికలై తెలుగు జాతిని సమైక్యం చేయగలవని, ఆ విధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవని విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన తెలుగు ఉగాది రోజున ప్రారంభమై ఒక వారంరోజుల పాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసిన ప్రముఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు. ఈ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల, కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటంచేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని 'మ్యూజియంను' స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజభూతమవుతుంది. తెలుగువారి సంస్కృతి నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజులపాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతీ సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదంచేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి.



ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకువచ్చిన అకాడమీల అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగు వారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

**జలగం వెంగళరావు**
అధ్యక్షులు,
ప్రపంచ తెలుగు మహాసభలు

# వాగ్గేయకారులు - పదకృతిసాహిత్యం

ఆత్మకు సంకల్పము గలుగును. అప్పుడది మనస్సు నుద్బోధించును. ఆ మనస్సు నాభియందున్న యగ్నిని గొట్టును. అగ్ని-వాయువును ప్రేరేచును. ఈ కార్యతంత్రమే-నాదమునకు-"పురుడు"-దీర్చుట. బ్రహ్మ గ్రంధి నుండి బయలుదేరిన నాదము-'నాభిహృత్కంఠరసననాసాదుల'కెక్కి వ్యక్తమగుచున్నది. అది-నాభియందలి సూక్ష్మము. హృదయమందీషద్వ్యక్తము. కంఠమున బూర్ణరూపముతోనుండును. మూర్ధమందపూర్ణము, ముఖమునందుఁగృత్రిమనుట; నాదము మరల రెండు రీతులు. అనాహతనాద-మొకటి. ఏకాగ్రమైన మనస్సునకే యిది సాధ్యము. కనుక-దీనిని గురూపదిష్ట మార్గమున మహర్షులు పాసింతురు; ఆహతము, మనుష్యులకు దక్కినది. ఇది లోకరంజకము భవ భంజకమును. నాదమొక మహాసముద్రము. దాని యుపాసనయు మహాయోగము; జన్మమంతయు పలురీతుల గానప్రస్తారములఁజూపి, విసివి-కడకు నాద సాగరమున శిరోదఘ్నముగ మునిగిన నాదయోగులను నేనెఱుఁగుదును. బిడారము కృష్ణప్పగారివంటివారు. అక్కడ లోకాపేక్ష తక్కువ. వింత స్వర పంపకముల కుస్తీలు లేవు. మెదడు నొప్పిఁబుట్టించు తాళముల ఖత్తులేదు. ఆ స్వర పంపకము చక్కని రాజ మార్గము. వారు వాడు తాళము లేడెనిమిదికి మించిలేవు. అకారముల హావళి-ఎత్తుగడల హేషారవము-ముక్తాయింపుల కోలాహలము యేదియు నుండదు. వీనియన్నిటికిని నాదముతో

నాలుమగలయొద్దిక. ప్రత్యేకనుగఁదమ మొగముఁజూపించుటకే సిగ్గు. కాని, యీయనుభూతిని బంచికొనుట కల్ప సంస్కారము చాలదు.

నాదమునుండియే "స్వప్తస్వర సుందరుల" యావిర్భూతి. ఇవి, "సామనిగమజ"ములట!, అచ్చట వీనికి మూరు పేరులున్నవి. సప్తస్వరములు "సామవేద సార-"మని త్యాగయ్య; పరమశివుని సద్యోజాతాది పంచవక్త్రములనుండి పుట్టెననుటయు నొకవిశ్వాసము వీనిలో-షడ్జ పంచమము లవికృత స్వరములు; తక్కినవి వికృతులు. అన్నియుఁగలిసి-యిరువదిరెండైనవి. మరలనివి-మంద్ర, మధ్య, తారములని ముత్తెఱఁగులు; కవిత్వమునకు వాగర్థములవలె, సంగీతమునకు రాగ తాళములు ప్రధానములు. వీని లయమును సాధించుశే "మహాకవిత్వ దీక్షావిధి". నాదములేనిది రాగములేదు; గీతము లేదు. సమస్త ప్రపంచమునకును, నాదమే మూలాధారమని యోగుల మతము; "శంకర నారాయణ విధు"లునాదగమ్యులు మాత్రమే కాదు-"నాదోపాసకులును"-"విశ్వమెల్లనిండి యుండేవాడు-" "తంత్రీ లయ స్వరగాన విలోలుడు"-పరమశివుఁడు "నాదతనుఁడే"యైనాఁడు. సురపతి నాద సాధకుఁడు. వీరావతారుఁడగు శరజన్ముఁడును నాద లాలసుఁడే. తోరపుఁబొజ్జగల గణపతికిని 'సారీగామా'-యననిది తోచదు. ఇంకనున్నారు. భృంగి మతంగసమీరజులు, భరతాదులు. ఈ గుంపులో నగస్త్య మార్కండేయులును దూరినారు. బ్రహ్మానందమునకు దగ్గరి మార్గము సంగీతమని-యయ్యగారి సూక్తి. అంత మాత్రమేగాదు. సదాశివమయమగు నాదోంకార స్వరవిదులు జీవన్ముక్తులు. పై పెచ్చు 'భావరాగలయాది సౌఖ్యము', చిరాయువులు గల్గించునని హామీ. త్యాగయ్యగారు తన రామప్రాప్తికిఁగారణము

"పాద మహిమో! పెద్దలాశీ
ర్వాద బలమో! సుస్వరపు
నాద ఫలమో!—



-అని చెప్పికొన్నారు. తక్కిన రెంటిలో వారి వినయ సుగంధము;- సుస్వరపు నాదఫలమే-రామ ప్రాప్తికిఁగారణమని వారి పూర్ణ విశ్వాసము. అల్లే-మరియొకచోట

'పలుమారు నిన్ను పాడి పాడి వేడికొన్నాను'-

అన్నారు.

నాదనుయొక్క-'బహురూపముల'-రాగమని పేరు. -'అనంతావై రాగారి'-రాగములకు లెక్కలేదు. ప్రస్తారముతో ఛందస్సులవలె-చమత్కారములతో నలంకారములవలె-శాస్త్రము బెరుగుకొలఁదియు వీని సంఖ్యయుఁబెరిగినది. సమర్థులైనవారు-వ్యాప్తికిఁదెచ్చి-చక్కగ నిర్వహించిన రాగములును లేకపోలేదు. 'గురుగుహ-"ముద్రలో కృతులు రచించిన సంగీత త్రిమూర్తులలో నొకరగు ముత్తుస్వామిదీక్షితులు ప్రసిద్ధులుగదా! వీరి తండ్రి రామస్వామిదీక్షితులు.-'హంసధ్వని'-రాగమునకు రూపురేఖలేర్పఱచినది వీరేనందురు. కాని, నేఁడు-చాలమంది-యేవేవో వింత వింత రాగములను బాడుటకు-బాధపడుచున్నారు. ఉన్న రాగములు వారి భావ సృష్టికి చాలనట్లు; వారు పాడు రాగములకు వారువేయు కల్పనా స్వరముల కోర్చుకొనునంత కడుపైన నుండదు. పైగా-శతమానము వక్రగతులు, 'పులిమీద పుట్ర' యనునట్లు ఉత్తరాది వారినుండి యెరువు దెచ్చికొన్న వింత వింత బాణీలు. అదియట్లుండె; అఖండమైన కాలమును-ఖండములొనర్చి,యెచ్చుతక్కువలు లేకుండ-నికరముగ జోడించి, తనియుటకే తాళమని పేరు. నాదముగూడ నఖండమైనదే. దానిని వేర్వేరు సరళ రేఖలుగాఁదీర్చి, జోడించినప్పుడు-ముచ్చటయైన సౌందర్యమేర్పడును. దానిని గ్రహించి, దానివెంట మనము నడచి, లయానంద మనుభవింతుము. రాగ తాళములు పరస్పర మొదిగిపోయినప్పుడు-మనస్సున కనితరవేద్యమగు నానందము గలుగును. సంవాదమున

కానందపడుట మనస్సునకు సహజ ధర్మముగనుక; భావముయొక్క క్రమపుష్టి లేనిది రాగము గాదు. ఒకవేళనైనను-అది సర్కస్సుగాని, సంగీతముగాలేదు ఆధారషడ్జమును చక్కగా నంటిపట్టుకొని, స్వరము లను వాని వాని స్థానములలో శుద్ధముగ బలికించుటయే శ్రుతి లయము. శ్రుతిలయము లేనిపాట-సమ్మతిలేని మాటవంటిది. భావ రాగములను ధిక్కరించి, తాళమధికారము నెఱపుట-బీద బలిసి బందె కాఁడగుట. అయ్యో! యిది దురాక్రమణగదా! యని మనస్సులో బాధ. శ్రుతిలయ మొకవేళ యభ్యాసముతో సిద్ధించినను-భావ లయము మాత్రము తపస్సాధ్యము. కొందరికి శ్రుతిలయముగూడ నుండదు. కర్ణాటక గాయకులలో నీ దౌర్భల్యమెక్కువ. కచ్చేరి యంతయు శ్రుతిలో గాత్రము సరిగా నదుకక-సకిలింతలతో-అపస్వరపు మూట యైన గాయకులను నేనెఱుఁగుదును. అట్టివారికి-సంఖ్యా ప్రధానమైన తాళమే శరణ్యము. వింత వింత లెక్కలను ప్రస్తరించుటలో-గ్రామ కరణాలకును-వీరికిని భేదముండదు. మొదటనే-యే సంకీర్ణజాతి ధృవ తాళమునో యేరికొందురు. తలనొప్పి కది చాలును. అందులో వెఱ్ఱి వెఱ్ఱి ప్రస్తారముల కమృతాంజనము ఖర్చు. ఈకోలాహలములో గాయ కుని మనస్సునకు-రసభావములవైపుఁజూచుటకు తీరికేదీ? ఎన్నుకొన్న తాళమెక్కడ దప్పునోయని, యొంటినిండ చెమట! నడుమ నడుమ మార్చు జాతుల కెన్ని వర్ణములో-ముఖమున నన్ని సొట్టలు, ఆ వైభవము-'క్రాంతం క్రతుంచాఽశుషము'-గానుండును. తొడలతో లెగిరిపోవునట్లాతడు-మర్దించుట జూచి, 'అయ్యో పాప మీ జీవికెందు కింత వేధ-"యని మనము జాలిఁబడవలసివచ్చును. చాలని దానికి తాళ ముతో సాహిత్యము నీడ్చుటకై అవసరమున్నను లేకున్నను-'ఉ ఊ ఎ ఏ"-ల కోలాహలము స్వరములకుఁబదచ్యుతి ప్రారంభములోనే జరుగును. వానిని గాయకుఁడు బహుకాల మెండలో నెండిన వరుగు లనువలె-చప్పరించుచుండును. ఇఁక సాహిత్యమా! అది రావణునకుఁ



జిక్కిన రంభ. ఒకసారి యొక గాయకుడు-ప్రసిద్ధుఁడే-పాడు చున్నాడు. ముందొక పెద్ద బోర్డు. 'ఇక్కడ సంగీతమమ్మబడును'-అన్నట్లున్నది. లోపల గూర్చున్నాను. 'నగుమోము గనలేని'-అను త్యాగయ్యగారి కృతినెత్తికొన్నాడు. 'అభేరి' రాగమే మృదువైనది. అయ్యగారి సాహిత్యమంతకన్నను మృదువుగానున్నది. మనస్సును నీరుగా నొనర్చు నా రచన యీ క్రిందిది:—

**అభేరి-ఆదితాళము**

"నగుమోము గనలేని నా జాలి దెలిసి
ననుబ్రోవగ రాదా! శ్రీ రఘువర! నీ ॥న॥

॥నగరాజధర! నీదు పరివారు లెల్ల
ఒగి బోధన జేసే వారలుగారే! అటులుందు రేని ॥న॥

॥ఖగరాజు నీ యానతి విని వేగ చనలేదో
గగనాని కిలకూ బహుదూరం బనినాడో

॥జగమేలే పరమాత్మా! యెవరితో మొఱలిడుదు
వగఁజూపకు తాళను నన్నేలుకోరా! త్యాగరాజనుత! నీ ॥న॥

-రాగమును ప్రక్కనబెట్టి-వచనముగాఁజదివికొన్నను, పదముల యొద్దిక యెంతయో బాగున్నది. సంయుక్తాక్షరములకును సంగీత మునకును వైరము. 'నగరాజ ధర!'-యనుటలో 'ధర-గోవర్ధనము నెత్తుటలోని పరిశ్రమమును సూచించుచున్నది. పరమాత్ముఁడు-బరు వైన గొప్పవాఁడు. సాహిత్యము సర్వాంగ సుందరమైనది. చతురశ్ర గతితో హాయిగా నడచు నాదితాళము; విలంబకాలములో పాడి-రసము తాననుభవించి యితరుల ననుభవింపఁజేయుట కెంతయో యవ కాశమున్న కృతి. ఆ పండితుఁడు-మొదటనే-ద్రుతగతితో నారంభించి-సంగతుల రభసలో-భేతాళుని మూతివలె నున్నరాముని మొగమును

మాపై విసరివేసెను. 'ఖగరాజు'-వచ్చువేళకు-'మురళి భంజళి'-మొదలైన యొక్కచే గుఱ్ఱముల నడకలు. సభలోనున్న సంగీతజ్ఞుల రొద; వారు శక్త్యనుసారముగ తాళములను దిక్కులకు విసరివేయుచుండిరి. 'నేనేమి తక్కువ తిన్నా'-నని ఫిడేలు వాద్యము విజృంభించినది. మర్దల ధ్వనుల ఢమఢమలు. ఒక్కచే సంత బజారువంటి ఘోష; ఇక్కడ, 'రసభావాశ్రితమైన సంగీతమేదీ'-యని వెదకితిని. ఉల్లిపాయలలో మల్లెవాసనలా!', కడపట గూర్చొని యుంటిని గనుక-'బ్రదుకు జీవుడా'-యని బైటపడినాను. ఇదే తామస సంగీతము. త్యాగయ్యగారు జన్మమంతయు నుపాసించిన సాత్త్వికసంగీతమును-గాయకుడు కష్టపడి తామసమున కీడ్చెను. త్యాగరాజీ యుద్ధములెఱుగనే యెఱుఁగడు. విలంబ కాలంలోనున్న సాహిత్యమునకు మధ్య కాలమును జోడించు స్వాతంత్ర్యము గూడ నాతఁడరుదుగాఁదప్ప నవలంబింపలేదు.

సంగీతమునకు రాగము ప్రధానమంటిమి. పదమేమో చిన్నదే. దాని పరివారము గంపెడు. మూర్ఛనలు-గ్రామములు-గమకములు మొదలైనవి. వాది వివాది స్వరసంచయమును; గమకములేని రాగము రోగమే. ప్రపంచమునందే భారతదేశ సంగీతమునకొక వైశిష్ట్యమును దెచ్చిపెట్టినది గమకము; పాశ్చాత్యులు రాగము నెఱుఁగరు. వారి గానమంతయు స్వరములే. ఆ స్వరములును-వాగ్గేయకారుఁడు గూర్చినవే. గాయకునకు చిన్నమెత్తు స్వాతంత్ర్యము లేదు. వాఁడు వ్రాసిన దానిని-వీఁడు చిలుకవలె నొప్పించును. మన గానమట్లు గాదు. వాగ్గేయకారుఁడిచ్చిన కృతి-రాగ తాళములు అల్పాల్పములైన సాధనములు. ఆ చట్టములో-గాయకుఁడు బ్రహ్మాండమైన గంధర్వ నగరమును సృష్టింపవలెను. గంధర్వ నగరమని యేల నంటిననఁగా-వాని సృష్టి యెప్పటికప్పుడే పుట్టి గిట్టునది.



ఇపుడైనను గొంతమేలు; 'శేపురికార్డింగు'-మొదలైన క్రొత్త క్రొత్త సాధనములు గొన్ని యనుకూలములు గల్పించినవి. ఆ యనుకూలములును-గొంతవఱకే; నాయుడుగారి 'కల్యాణి'-రాగమున్నది. మధురమైన రాగ ప్రస్తారము. ఆయనయే సనకసనందనాదుల కోవకో చెందినవాఁడు. కాని, అదే వారి సర్వోత్కృష్ట సృష్టియని చెప్పలేము. నేఁడు నాయుడుగారే బ్రతికియుండి-దానిని వినుట తటస్థించినచో, 'నిదేమున్నదని, యంతకన్నను బాగుగ వాయించి యుండెడివారేమో! చింతలపల్లి వెంకటరావుగారుండిరి, 'కలియుగ దల్లిహరి'-అను పురందరదాసు దేవర నామము-వారంతకుముందొకసారి బాడియుండిరి. అది మా చెవులలో గింగురుమనుచున్నది. మరల సంవత్సరము తరువాత-దానినే మరియొక కచ్చేరీలో నెత్తికొన్నారు. మొదటి పాట దీని ముందట దివిటీ ముందరి దీపము, అయిన నిదియే సార్వత్రికము గాదు. నిన్నటి పాటను నేఁడదే గాయకుఁడు-చెఱచి చెటాకులు చేయవచ్చును. సంగీతము కావ్యరచన వంటిదిగాదు. చాల కష్టమైన పని. శరీరారోగ్యము-శీతోష్ణములచే చెఱగని గాత్రము-అన్నిటినిమించి శాంతమైన మనోధర్మమున్నపుడే సంగీతము సాధ్యము; గమకములు ప్రధానముగ వీణా వాదనమునకు సంబంధించినవి. వీణ మనకు ప్రాచీనమై-రమణీయమైన వాద్యము. మన సరస్వతీదేవి-కచ్ఛపీ వీణాధారిణి, రామయామాత్యుఁడు వీణనుగూర్చి యీ మాటలన్నాఁడు.

శ్లోక॥ ధర్మార్థకామ మోక్షాణాం ఇయమేవ హి సాధనం
అశ్వమేధ ప్రకరణే వీణోక్తా ధర్మసాధనం
వీణా వాదాను రక్తిభ్యో రాజభ్యో వైణికాజనాః
లభంతే కాంక్షితానర్థాన్ తస్మాద్వీణాऽర్థ సాధనం
॥కామయం తేహిగా యంతం స్త్రియఇత్యాది తంత్రుతౌ
గాన స్య కామహేతుత్వం గానోత్పత్తిస్తు వీణయా॥

॥వీణా వాదన తత్వజ్ఞః శ్రుతి జాతి విశారదః
తాళజ్ఞ శ్చాఽప్రయాసేన మోక్షమార్గం నిగచ్ఛతి॥
॥ఇత్యేవం యాజ్ఞ వల్క్యేన వీణా మోక్షాయ శంసితా॥

(సర్వమేల కలానిధి).

-వీణ సర్వార్థ సాధకమని పై దాని పిండితార్థము. అశ్వమేధ ప్రకరణములోనది ధర్మసాధనమని చెప్పఁబడినది. వీణా వాదకులకు మెచ్చి రాజులు విత్తమిత్తురు. కనుక నది యర్థ సాధకము. వీణెనుగా మించి వెలఁదులు పైఁబడుదురట తృతీయ పురుషార్థమునకిది తిరుగు లేని సాధనము. సంగీత శాస్త్రజ్ఞానము-'సారూప్య సౌఖ్యద'ము. వీణను వాయించుటయే నిజముగా నొక తపస్సు. "కమ్మని లతాంతములకు మొ్మనసివచ్చు మధుపమ్ముల సుగీత నినదమ్ములు"-వెంట వెంట నంటినట్లుండును. తంబూరలో జీవాళము సరిగ కుదిరినప్పుడు-కేవల శ్రుతినే గంటలకొలది వినవచ్చును. 'ఫిడేలు' - వాద్యము చక్కనిదే. కాని సూక్ష్మ సూక్ష్మతరములైన గమకముల కవకాశము తక్కువ. స్వరము తన స్థానమును వదలక-తనకు వెనుక ముందున్న స్వరస్థానములతోఁ జెలిమికట్టి నడచుటకు గమకమని పేరు. లయకుఁ జిక్కక-తప్పించుకొని తిరుగు నాద భేదముల నీగమ ప్రక్రియచే సాధించికొనవచ్చును. దీనితోననేకములైన భావ భేదములను జూపించుట కవకాశమున్నది. ఔత్తరాహుల కట్లుగాదు. ఆధారషడ్జమందే యన్ని స్వరములును లయింపవలెననుట వారి పద్ధతి. అందుకై లీనమగునట్లు కనుపించని-యెన్ని సూక్ష్మ స్వరములనో వారు వదలివేయవలసివచ్చును. వారికి శ్రుతి ప్రధానము. కర్ణాటకులకు లయపైఁ జూపు. ఇట్లనుటతో వారికి లయ జ్ఞానమును-వీరికి శ్రుతి జ్ఞానమును లేదని యర్థము గాదు. ప్రధాన దృష్టి దానిపై నంటినంతే! చాల



మంది యుత్తరాది సంగీతము వినుటకింపుగా నుండునందురు. నిజమే. 'సంగీత-మాపాతమధుర'-మనుమాటకు-చాల సార్థక్య మందు గలదు. శ్రుతి చెవితో గ్రహించునది. అందుకే దానికి 'శ్రుతి'-యని పేరు. నాద మాధార శ్రుతిలో నెంత లయించిన నంత శ్రవణపేయము. అది యాధిభౌతికము, కాలగతి యెంత లయబద్ధముగనున్నచో-నంత యాత్మకు దృప్తి. ఇది యాధ్యాత్మిక మూలద్రవ్యము. ఈ రెంటిని సమన్వయించుటకై కొంత ప్రయత్నము జరిగెను. కాని-యట్టి మహానుభావుఁడింకను బుట్టవలసియున్నది. శ్రుతి లయల ప్రాధాన్యముతో-నిర్వురి రసభావావిష్కారమందును చాల భేదమున్నది. లాలిత్యము-దైన్యము మొదలైన లక్షణము పౌత్తరాహ సంగీతమునకుఁ బ్రధాన గుణములుగఁ బరిణమించినవి. కర్ణాటకమునకు-హఠము, గాంభీర్యము-ఉత్సాహము మొదలైనవి-ప్రముఖములైన ధర్మములు. ఉత్తరాది సంగీతములో 'పురుష ధర్మములు'-లేవని గాదు. ఉన్నను-వాని ఛత్రచ్ఛాయ మార్దవము. సురభి కంపెనీలో స్త్రీలు పురుష వేషము వేసినట్లు. కర్ణాటకుల లాలిత్యాదులు నంతయే. సంజీవరావు గారి సక్కూబాయి వేషము. అందుకే కర్ణాటకులకు ఘనరాగములపై మక్కువ. 'నయరాగము'-లు జనరంజనమునకై బాడినను-వానియందాసక్తి తక్కువ. ఔత్తరాహులకు-'రాగరాగిణీ' భేదములున్నను-అవి శాస్త్రము మాత్రమే. రాగిణులపై-వారికిఁ బ్రణయము. గమకములు స్థూలముగఁబడియైనను వ్యవహారమున నెన్ని రీతులుగనో ప్రత్యక్షమగును. కంపితములేనిది కర్ణాటక సంగీతమే లేదు. అది దాని జీవాతువు. గమక భేదముతో రాగ స్వరూపమే మారును. 'మగరి' - యను ప్రయోగమున్నది. దీని సంగతి-యారభిలో 'మామగరి'-యని పలుకును. కేవలము 'మగరి'-యన్నచో-'సామ'-యగును ఈ గమకములను 'చిట్టా'-దీయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. కాని యసాధ్యము. గాత్రములో

త్తురా! యిపుడు, నీ హరామితనమే
లరా! భక్త త్యాగరాజనుత! నా ॥ఎ॥

-శంకరాభరణము సంపూర్ణము. ప్రతిస్వరముననూ, గమకమున కాస్పదమున్నది. సంచారము సందుగొందులులేని రాచబాట! తాళము చతురశ్రగతిలో సునాయాసముగ సాగుచున్నది. శుద్ధమధ్యమముతో ప్రారంభమగుట రామునితో తెగదెంపులు జేసికొన లేని న్యాయ నిష్ఠురము లాడుచున్నది. సమగ్రహములోని యెత్తుగడ దైన్యమునకుఁ దోడుపడుచున్నది. శంకరాభరణమును చాల లలితముగా మలచికొన్న నిర్మాణమిది. 'తరాన దొరకని' యిత్యాదులలో—'జగణము' తో నారంభమైన ప్రాస-'మర్దల తాళగతుల'-కు పండుగ, 'హరామితనము' లో భాషాదౌర్బల్యమును, గలదు. దీక్షితుల శంకరాభరణ కృతియనున్నది. త్యాగరాజుల రచనయే దానికి ప్రేరకము.

**శంకరాభరణము, చాపుతాళము**

॥ అక్షయ లింగవిభో! స్వయంభో!
అఖిలాండకోటి ప్రభో! పాహి, శంభో! ॥అ॥

॥ అక్షర స్వరూప! అమిత ప్రతాప!
ఆరూఢవృషవాహ! జగన్మోహ! ॥అ॥

**మధ్యమకాలము —**

॥దక్షశిక్షణ! దక్షతరసురలక్షణ! విధివిలక్షణ!
లక్షణ! బహువిచక్షణ! సుధాభక్షణ! గురుకటాక్షవీక్షణ॥
॥బదరీవనముల నాయికాసహిత; భద్రకాళీశ! భక్త విహిత
మదనజనకాది దేవ మహితమాయాకార్య కలనారహిత!



సదయ! గురుగుహతాత! గుణోపేత!
సాధుజనోపేత! శంకరా! నవనీత హృదయ!
విభాతతుంబురు సంగీత, హ్రీంకార సంభూత! హేమగిరినాథ ॥అ॥

॥సదాశ్రిత కల్పక మహీరుహ పదాంబుజ! భవరథగజతురగ
పదాతిసంయుత చైత్రోత్సవ! సదాశివ! సచ్చిదానందమయ ॥అ॥

-రచన యంతయు సంస్కృతమే, వారు గీర్వాణ ప్రియులు. తమిళమున మాత్రము-గొన్ని కృతులున్నవి. 'త్యాగయ్య' గారి లో-గడపటనే ముద్రయుండును. వీరికానియమములేదు. ఎక్కడో యొకచోట - 'గురుగుహ' —యుండును. మధ్యమకాల చరణములోని-'క్ష' కారప్రాసకొట్టవచ్చుచున్నది, 'హ్రీంకార సంభూత'— యనుచోట ధాతువు—సాహిత్య దీర్ఘమును మ్రింగినది, త్యాగయ్యగారైనచో, తారషడ్జమమున కెగిరి, హృదయమును దట్టియుందురు. కడపటి చరణములోని,' జగణము'—ప్రసన్నతను గోల్పోయి— ప్రౌఢిమను సంతరించుకొన్నది. సంస్కృతము నడుమ'బదరికావనములు' తెలుగు జిక్కి-గాలిలో నెండుటాకువలె రెపరెపలాడుచున్నది. దీక్షితులు, త్యాగరాజు—ఉత్తర దక్షిణ ధ్రువములు. అందుకే విద్వాంసులు—దీక్షితులది 'చోళబాణి' అయ్యగారి 'దాంధ్రబాణి' యన్నారు. దీక్షితులు స్వయముగా సంగీతమున కలంకరించిన గొన్ని తొడవులును గలవు. 'శొల్‌కట్టు'—స్వరములలో జతులను జోడించు పద్ధతియును వారు వ్యాప్తికిఁ దెచ్చినదే. ఈ క్రింది కృతి గమనింపుడు :

**కేదారరాగము-మిశ్రచాపు**

ప ॥ఆనంద నటన ప్రకాశం, చిత్సభేశం
ఆశ్రయామి శివకామ వల్లీశం॥

అ. ప ॥భానుకోటి కోటి సంకాశం
భక్తి ముక్తి ప్రద దహరాకాశం

మధ్యమకాల సాహిత్యము : దీనజన సంరక్షణచణం
దివ్యపతంజలి వ్యాఘ్రపాద
దర్శిత కుంచితాబ్జచరణం ॥అ॥

దీని చిట్టి స్వరములో

ఫా ణీ ని సతకరఝుణుత స ని స ఝుంతరిత సమగమపా ప ని మ గ త ధ ణ త క మగమమప సనిని— తజంతరి పామగ తధిగిణతొ

—యీరీతి స్వరములును—జతియును వెంటవెంట వచ్చును. చరణమునందు రాగ ముద్ర వేయఁబడినది

"శీతాంశు గంగాధరం, నీలకంధరం
(శ్రీ) కేదారాది క్షేత్రాధారం"

-కేదారాది క్షేత్రముల కాధారభూతుఁడని యర్థము. 'కేదార రాగము పేరు గూడ నున్నది. అట్లే —కాంభోజి రాగములో, 'సద్గతి దాయ కాంభోజి చరణేన' యన్నాడు. కుముదక్రియా రాగము లోని —'అర్ధనారీశ్వరం'-అను కృతిలో 'కుముదక్రియారాగనుతే'— అని వచ్చును. చిట్టి స్వరములను రచించుటలో దీక్షితులు జూపిన మరికొన్ని చమత్కారములు గలవు. వారి —'కమలాంబాంభజరే!'— యను నవావరణ కీర్తన యున్నది. అది కల్యాణిరాగము, దాని చిట్ట యిది—

॥స రి గ మ ద ని-రి గ మ ద-మ ద ని గ స ర-ని రి గ రి-స ని



రి స సా-ని దా ద పా-పా ద దా ని సీ-స రి ని స-ని గ రి ని-రి స గ
ని-ద మ ద మ-గ రి ని ద-మ గ రి స—

ఈ చిట్ట యనులోమ విలోమములుగా బాడవచ్చును. అట్లు బాడినను-రాగ భావము చెడకుండుట-దీనిలోని ఘనత. ఈ ప్రౌఢిమ నన్ని రాగములలోను జూపుటకు వీలుండదు. ఆరోహణావ రోహణ ములలో-సంపూర్ణ షాడవౌడవములలో నిట్టి చమత్కారములు సాధ్య మగును. అన్య స్వరముల ప్రవేశమున్నను కష్టమే. సాహిత్యములో నిట్టి చమత్కారములు నెఱపిన రామరాజభూషణునివంటివారు న్నారు. వసుచరిత్రలోనిదీ పద్యము:—

చ ॥ అఱిమి రమాకుమారు డపు డగ్రతలంబున వచ్చి నిల్చిన
ట్ల ఱిముఱి దోఁచిన న్గువలయాక్షి వడంకి కడంక దూలి, మై
మఱచి, సగంధ గంధగిరి మారుత పాతిత వల్లికాభయై
యొఱగిన, సంభ్రమించి, చెలులుద్గత బాష్పతరంగి తాక్షులై ॥
(3–199)

ఇందలి 'రమాకుమార' శబ్దము పై చిట్టా వంటిది. సంగీతములో నిట్టి ప్రయోగములు జరిగినవి. ఒకటి మచ్చునకు :—

భైరవి-ఆది తాళము

॥సరసకు రాకు సరస
వరమన ను నమరవ ॥స॥

పరవె లేదు లే వెరప
నరవమను మవరన
॥రాజీవ న యన వజీరా ! ॥స॥

పై వర్ణమును వాలాజాపేట వెంకటరమణ భాగవతులు-వీణ కుప్పయ్యరుగారు రచించిరి. సాహిత్యము కొంత యస్పష్టముగా

నున్నది. అది యానాటి తంజావూరి తెలుగేమో! గ్రథనములో 'స్వరాక్షరము' మరియొక పాండిత్యము. అనగా-స్వరములోని యక్ష రములును-సాహిత్యాక్షరములొక్కటిగా నుండుట. సంగీత సాహిత్య సమస్కంధులైనట్టి వారిట్టి రచనము లక్కడక్కడ జేయుదురు. త్యాగయ్యగారు-'అమృత వాహిని' రాగములో నీకృతి నల్లిరి.

**అమృత వాహిని-ఆది తాళము**

॥శ్రీరామ పాదమా! నీ కృప జాలునే
చిత్తమునకు రావే ॥శ్రీ॥

॥వారిజ భవ సనకస నందన-
వాసవ శ్రీ నారదాదు లెల్ల బూజించే ॥శ్రీ॥

॥దారిని శిలయై తాపము తాళక
ధారగ కన్నీరు రాల్చగ
శూర! అహల్యను జూచి బ్రోచితివీ
యారీతి ధన్యు జేయవే! త్యాగరాజ గేయమా ॥శ్రీ॥

శ్రీరామునితో నేమని-యతని పాదమును బట్టికొన్నాడు, 'దేశికులు' 'పాదుకాసహస్రమును'వలె. మార్దవము త్యాగయ్య సొత్తు. "చాలునే-రావే-చేయవే!" యిత్యాదులు-శ్రీ చరణముల సన్నిధిని గూర్చుండి-పాదమును బుజ్జగించుచున్నట్టులున్నది. ఇది షాడవ రాగము. 'స రి మ ప ద ని' 'స ని ద మ గ రి'యని దాని స్వరూపము. ఆరోహణా వరోహణములలో-గ-ప-వర్జితము. 'పాదమా' యనెడు సాహిత్యమును 'పాధమా'యనెడు స్వరసంచారమును నొక్కటే. దీక్షితులిట్టి విద్దెలెన్నో జేతురు. 'అక్షయలింగవిభో!' యను వారి కృతి లోని సదయ గురుగుహ 'సదాశ్రిత-పదాతి సదాశివ' మొదలగు నవన్నియు స్వరాక్షరములే. త్యాగయ్యగారివలెనే, దీక్షితులును, మహా



తపస్వులు; శ్యామా శాస్త్రిలును. అందుచే-వారి సంగీత సాహిత్య ములు-వినయ గౌరవములతోఁజూడఁదగినవి. ముప్పురును 'ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి' కోటికెక్కినవారు. దీక్షితులకు-మృదంగ విద్వాంసుడు 'తంబియప్పన్' అను శిష్యుడుండెనట. అతనికిఁగడుపునొప్పి రోగము వచ్చెను. మందు మాకులతో నది మాయ లేదు. ఎవరో యొక పురోహితునడుగగా-జాతకము జూచి, 'నీకు గురు శని గ్రహములు చాలలేదు. వానికి వేదోక్తరీతి శాంతి చేయ వలెను. వేదాధికారములేని నీకది సాధ్యము కాదుగదా! వేఱు విధ మైన శాంతిక్రియలు నేనెఱుగను. ఏమి చేయవచ్చును!" అన్నాడట. తంబియప్పన్ దుఃఖముతో నీగాధ గురువుతో జెప్పికొనెను. వారు 'బృహస్పతే!' యనుకృతియు 'దివాకర తనూజం' అను శనిస్తుతియు రచించి 'యీ రెంటిని ఒక్కవారము భక్తితో పాడుకో' నీకు క్షేమ మగును. అని యుపదేశించిరి. అతఁడట్లే చేసెను. ఉదరశూల తగ్గినది. ఇట్టి సన్నివేశములలో-ననాథ భక్తుల కెందరికో యుపయోగకరమగు నని 'నవగ్రహస్తుతులు' రచించుటకై-తంబియప్ప దీక్షితులను ప్రార్థించెను. వారట్లే యొనర్చిరి. తంబియప్ప భక్తితో వానినిఁబున శ్చరణ జేసికొనుచుండెను. నవగ్రహవేదలలో నతఁడు భస్మము నా పాటలతో మంత్రించి భక్తుల కిచ్చుచుండెడివాడట. ఒకసారి యనా వృష్టి యేర్పడెను. జనులు నీటికై వేకారుచుండిరి. దీక్షితులకు దయ గల్గినది. వా'ఁమృత వర్షిణీ' రాగములో నమ్మవారిని ప్రార్థించుచు 'వర్షయ వర్షయ వర్షయ' అన్నారు అంతే. వాన-వానకాల్లు గట్టి కొన్నది. మరల నా వాన నిల్చుటకు వారే 'స్తంభయ స్తంభయ'యన వలసివచ్చినది. దీక్షితులు ప్రధానముగ శ్రీ చక్రోపాసకులు. వారి దైవము సోమాస్కందమూర్తి. అనగా-పార్వతి షణ్ముఖుడు-వీరితో జేరికొన్న పరమశివుఁడు. కాని వీరి యుపాసన తాంత్రికము. వామా చారమును జేరినట్లున్నది. కేవల సాంకేతికమగుటచే-వీరి మూర్తి

భూలోక పరిధులకు దిగి రాలేదు. త్యాగయ్య కీగొడవలు దెలియవు. వారిది కేవలము హార్దమైన భక్తి మార్గము. మఱుగులేని నామ జపము. పెద్దల మాటల బడి నడవడి; కేవళూరొక గ్రామము. అక్కడి మూర్తి అక్షయ లింగస్వామి. ఒకసారి యా స్వామి దర్శనమునకై ముత్తుస్వామి దీక్షితులు పోయిరి. అప్పటికి వేళయైనది. పూజారులు వాకిండ్లు వేసినారు. 'దర్శన మిప్పింపు'డని దీక్షితులెంతయో ప్రార్థించిరి. వారు ఏందురా! పది జంగాలలో నీవొక బోడిజంగము పొమ్మన్నారు అప్పుడు బాడినదే 'అక్షయ లింగవిభో!'యను కృతి. పాట ముగియుటయు వాకిండ్లు దెఱచికొనుటయు నొక్కసారిగా నయ్యెనట! త్యాగయ్యగారి విషయముననిట్లే జరిగినది. వారు తిరుపతికి వెళ్లిరి. స్వామి దర్శనము ముగిసి తెర వేసినారు. అప్పుడు వారు—

### గౌళిపంతు—ఆది

॥తెర తీయగ రాదా! నాలోని
తిరుపతి వెంకటరమణా! మత్సరమను ॥తె॥

॥పరమ పురుష! ధర్మాది మోక్షముల
పారద్రోలుచున్నది-నాలోని ॥తె॥

॥ఇరవందగ భుజియించు సమయమున
నీగ దగులు రీతీ-నున్నది.
హరిభజనము సేయువేళ చిత్తము
అంత్యజు వాడకు బోయినట్లున్నది ॥తె॥

॥మత్స్య మాకలిగొని గాలముచే
మగ్నమైన రీతీ-నున్నది
అచ్చమైన దీప సన్నిధిని మరు
గిడబడి చెఱచినట్లున్నది ॥తెర॥



॥వాగుర యని తెలియక మృగగణములు
వచ్చి తగులు రీతీ-నున్నది.
వేగమె నీమతము ననుసరించిన
త్యాగరాజ నుత! మదమత్సరమను ॥తె॥

అని పాడినారు. వెంటనే, తెర జారిపడినది. పై కృతిలో సాహిత్య మెంత చక్కగానున్నదో నేను జెప్పవలసినదిలేదు. త్యాగయ్యలో నన్వయ క్లిష్టత యుండదు. మారుమూల పదము లుండవు. అతనికంత చదువు రాదేమో! త్యాగరాజు జీవిత రంగ మన్నమాచార్యులంత విశాలమైనదిగాదు. సుఖదుఃఖములంత మనోదఘ్నముగ ననుభవించిన వాడునుగాడు. సాహిత్య మన్నమయ్య సామ్రాజ్యము. నాదోపాసన త్యాగరాజు రాజ్యలక్ష్మి. ఇర్వురును చక్రవర్తులే. అన్నమయ్యను గాయకునిగా జూచి, విలువ నిర్ణయించు టెంత యన్యాయమో త్యాగయ్యలో సాహిత్యము వెదకుటంతే యన్యాయము. ఇర్వురకు రెండు నుపస్కారములు మాత్రమే. అన్నమయ్య యే ధోరణిలోనో పదకర్తయైనవాడు. త్యాగరాజు మొదలైనవారు-విధిలేక సాహిత్యమాశ్రయించినవారు. ఎందుకు విధిలేదో పైన వివరింతును. కనకదాసొకప్పుడు ఉడిపికి బోయెనట! అప్పుడాతనికిఁగూడ నిట్టి సన్నివేశమే జరగినది. వెంటనే కనకదాసు-'బాగిలను తెగెదు సేవెయనుకొడో! హరియె" యనిపాడెను. వాకిళ్లు విచ్చికొన్నది. తపస్వులకివి చాల నల్పమగుసిద్ధులు. దీక్షితుల రచనలకు విలంబకాలము ముఖ్యము. త్యాగయ్యగారు-మధ్యలయ ద్రుతలయలలో రచనలు నడుపుచుందురు. కీర్తన నెత్తిన వెంటనే-ఇది త్యాగరాజులదని-యిది దీక్షితులదని చెప్పుటకు పెద్ద సంగీత జ్ఞానమవసరములేదు. చెవిజాలును. త్యాగయ్యగారి'కృతి' యారంభనమైనదే పిల్లగాలివీచును. దీక్షితుల రచన మందగమనముతో మదగజమైసాగును. శుద్ధమైన శారీరము-శ్వాససిద్ధి చక్కని కాలపు ప్రమాణ జ్ఞానముగలవారు

మాత్రమే వారి రచనను సరిగా నిర్వహింపగలరు. నాదపారిశుధ్యమ్ము
నధికారము లేనివారు వీనిని పాడలేరు. పాడినను వినలేము.

మేళకర్త రాగములు డెబ్బది రెండంటిమి. ఒక్కొక్క మే
కర్త రాగమునుండియు 'తామరతంపరగా' ననేక రాగములు పుట్టు
వానిని జన్యరాగములందురు. వీనిలో చాల భేదములున్నవి. ఉపాం
భాషాంగములు. వర్జవక్ర రాగములు. మరికొన్ని నిషాద ధైవతా
ములు. పంచమముతోనే ముగియునవి కొన్ని. సంగీత కళార్థ
నిధి రామరాజభూషణుడొకచో—నిషాదాంత్యరాగము నిట్లు బేర్
న్నాడు.

చ॥ అకుటిల సౌమ్యమాన నిలయస్ఫురణంబును నాతిమాత్ర
రక పరివర్తనంబు, శుభరాగమిళత్పద పల్లవాంకము
ద్రికయును బెంపుమీర నిజదృష్టుల బోలిన సింధుకన్య
ప్రకటవివాహ గీతికలుపాడిరి పుణ్యపురంధ్రి కాముకుల్

అకుటిల మనగా వక్రసంచారము లేనిది. సౌమ్యమ్ము శు
మధ్యమము. నిషాదమునందు లయించునది. అనగా తారషడ్జము
నంది కొననిది అనియర్థము. తారస్వరము నందెక్కువ సంచార
'సైంధవి' రాగమునకు లేదు. నేటికిని బెండ్లిలో సైంధవియం
బాటలు బాడుదురు. ఉపాంగరాగములు జనకరాగ స్వరములనేగ
యుండును. కాని యారోహణావరోహణములందు కొన్ని స్వర
లుండుటయు నూడుటయుగద్దు. 'ఖరహరప్రియ'లో బుట్టిన 'ఆ
భి'లో దానివలెనే గాంధారమధ్యమములు; ధైవత నిషాదములు
కాని యారోహణములో గాంధార నిషాదములు లేవు. హరికాంభో
జన్యమైన 'మోహన'లో మధ్యను నిషాదములు రానేరావు. ఇట్లు
మేళకర్త రాగముయొక్క స్వరములనే గలిగియుండి—యొక్కచో



న్య స్వరమును గ్రహించు దానికి భాషాంగ రాగమని పేరు.
పచ్చిమిరియం ఆదెప్పయ్యగారు గూర్చిన 'భైరవి' లోని 'విరిబోణి'
ర్ణము ప్రసిద్ధమైనదే. వీరు త్యాగరాజుల సమకాలికులు. ఈవర్ణ రచన
కు 'త్యాగయ్య' మురిసిపోయెడువారు; ఇందులో గొన్ని ప్రయో
గములలో, 'శుద్ధచతుశ్రుతి' ధైవతములు, మారుచుండును. ఈ వర్ణ
మును బాగుగా సాధించినవాడు, స్వరకల్పనలో భైరవి ప్రయోగము
లకు, వెదకికొన బనిలేదు. గాంభీర్యము, లాలిత్యము, లోతు,
హొయలు, పెనవై చికొన్న యద్భుతరచన. మహాపండితులును,
విద్యార్థులవలె దీనిని సాధన జేయుచుందురు. మైసూరు వాసుదేవా
చారిగారి వార్ధక్యములో నొకసారి, యనంత కృష్ణశర్మగారు, వారిని
జూడబోయిరట! వారు భైరవి వర్ణమును సాధించుచున్నారు.
'ఇదేమి, మీరింకా' "అని రాళ్ళపల్లివారాశ్చర్యమును బ్రకటింపగా,
'సాదనెమాడబేకప్పా' అని! వాసుదేవాచారిగారనిరట శర్మగారే
నాతో నొకసారి చెప్పిరి.

కొన్ని వక్రరాగములున్నవి. అనగా నారోహణావరోహ
ణములు క్రమముగా నుండనివి. ఆనందభైరవి యొకటి. దానియారో
హణను-"సగరిగమ, పదపస" అని వచ్చును. దిగునపుడుమాత్రము-
'సనిదపమగరిస' అనియుండును. ఇవి మూడురీతులు. ఆరోహణ
వక్రము. 'ఆనందభైరవి'; అవరోహణవక్రము "సరిమపదనిస,-'సదనిదప
మరిగాగారిస' ఇది దర్బారు రాగము; కొన్నియుభయ వక్రములు
గలవు. 'సరిగమ పమదానిస, సనిపమగామరిస'యను కానడరాగము'
దైన్యమును, అశాంతిని, ప్రధానముగా దెలుపు రాగముల నిది
యొక్కటి. భూపాల, నాదనామక్రియల వంటిదిగాదు. త్యాగయ్య
గారి రెండు కృతులీరాగములో బ్రసిద్ధములు. ఒకటి యీ క్రిందిది.

## మోహన-ఆది

పల్లవి॥ నిన్ను కోరి యున్నానురా! నిఖిలలోక నాయక!

॥ని॥

అ.ప॥ నన్ను పాలింప సమయమిదే! నామీద కృపజూడర

॥ని॥

చరణము: సన్నుతాంగ! శ్రీనివాస!

ఇంతమాత్రమే సాహిత్యము. తక్కినదంతయు స్వరపాఠకు. శ్యామాశాస్త్రి,వీణకుప్పయ్య, ప్రొఫెసర్ సాంబమూర్తి మొదలగు వారు వర్ణ రచయితలున్నారు. 'రాగమాలికా వర్ణములు' గూడ గలవు. ఒక్కొకక్క వర్ణములో నెనిమిది-పది రాగములు గూర్తురు. నక్షత్రమాలికలును ప్రసిద్ధములే. 'పదవర్ణములలో' నన్నిటికి సాహిత్య ముండును. చౌకముగ బాడుటచే వీనికి 'చౌకవర్ణము'లనియు బేరు. తానవర్ణములు సంగీతము నందును 'పదవర్ణములు' నృత్యమునకును వాడుదురు. అభినయములో-సాహిత్య భావమును ప్రదర్శింపవలయు టయే-వీనిని చౌకముగా బాడుటకుగారణము. వడివేలు-మైసూరు సదాశివరావు-ప్రభృతులు 'పదవర్ణ'కర్తలు. మహావైద్యనాథయ్యర్ గారిది కాంబోజిలో నొక వర్ణమున్నది.

### కాంభోజి — ఆది

పల్లవి :— పంకజాక్షిపై నీకు పంతమేలరా ! యీ వేళ

అనుపల్లవి :—కుంకుమారుణ కోమలాంగ : గుహదా సాశ్రిత దయాపాంగ॥ చరణము :-నీ దానిపై దయజూడరా !

—పై వర్ణములో, స్వరాక్షరము లెక్కువగా వాడబడినవి. దీనికి లక్షణము లింతకు ముందు దెలిపితిని.



పదపమ, గమపని, నిదా, నినిదా, పగమాప, దాగరి, సరిగ.మగరిస, పదపరి, కజపని, నిదా, నించిత, ప్పగజేసి, దగ్గర, సరిగ, మంచము, పదసరిగ, మగరి, సమగరి, సనిదప, పదపమ, గమమా,

గగరిస, రిగమ

పై సరిగ, మంచి సమయము ననుంచి మదన, గమమా

రకే ... శియు

— ఇట్లే యీ వర్ణములో చాలచోటుల వచ్చును. 5వ యెత్తుగడ రెండవ యావర్తనములో, మృదంగయతియున్నది. మృదంగమెట్లుండును ఇరువైపుల సన్నగానుండి, నడుమగొంత యెత్తుగా నుండును. స్వరరచనయు నట్లుండవలెను.

| | | | |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| నిదని, | పదని, | మపదని, | గమపదని, |
| 5 | 6 | 7 | 8 |
| రిగమపదని, | గమపదని, | మపదని, | పద—. |

—పై రచనలో నెన్మిది దళములున్నవి. వీనిలో మూడవ దళమునుండి, యైదవ దళమువఱకు, స్వరము లెక్కుచుంబోయినవి మరల నారునుండి తగ్గినవి ఇదే మృదంగయతి. అంతేగాక సాహితిలో సరస సుకజనకాంభోజిరా !" యని రాగముద్రను శ్లిష్టముగా వేసినాడు. 'పదములకు, జావళీల,'కు స్వరూపములో నంతగా భేదముండదు. రెంటికి జీవము శృంగారమే. కన్నడములో 'దాసర పదగళు'న్నవి. వానిలో భక్తియే ప్రధానము. వ్యాసరాయలు శ్రీపాదరాయలు పురందరులు వీరందరు పదరచయితలై సామాన్యజనులలో భక్తి ప్రచార మొనర్చిరి. శృంగారము క్వాచిత్కముగా వచ్చును.

తాళ్ళపాక వారి రచనలలో గూడ, శృంగారము లేనివెన్నియో గలవు. నమ్మాళ్వారు పాడిన, "తిరువాయ్‌మొళిలో" నాయికా భక్తియే ప్రధానము. వారి పాశురములు వేయివఱకును గలవు. తాళ్ల పాక వారిలో, ప్రధానసంకీర్తనా చార్యుడైన యన్నమయ్యగారు, 'నమ్మాళ్వారు' నే యొజవడిగా బెట్టికొ నెనేమో ! అతని రచనలలోని జీవనాడి శృంగారమే. ఆధ్యాత్మికభావము లెక్కడో, అక్కడక్కడ తొంగిచూచును. క్షేత్రయ్య భావములలో నన్నమాచార్యు నేయనుస రించినాడు. 'జావళీ'కిని, పదమునకును తేడాయున్నది. 'ఎత్తుగడ', భిన్నముగా నుండును. 'జావళి', మధ్యకాలములోఁ బాడవచ్చును. సుపరిచితమైన, 'మధురా నగరిలో చల్లనమ్మబోను, అనునది జావ ళీయే. ఈ క్రిందిది ఘనంసీనయ్యగారి జావళీ—

## కురంజి, ఆదితాళము

॥ శివదీక్షాపరు రాలనురా ! నే
శీలమింతైనా విడువజాలనురా ! ॥శివ॥

॥ శివ శివ ! గురునాజ్ఞమీరనురా ; నే
శ్రీవైష్ణవుడంటే చేరనురా ! ॥శివ॥

॥ వడిగావచ్చి మతము జోరవకురా ! ॥శివ॥

వార్చనవేళ తలుపు తెరువకురా !
మడుగుకావిచెఱఁగు దీయకురా !
మాటి మాటికి నోరు మూయకురా ! ॥శి॥

॥ పంచాక్షరీ జపశీలనురా ! కూకి
పలుకులను వినజాలనురా !



కొంచెపు వగలు సే నెంచనురా !
మ్రొక్కుదు; రుద్రాక్షసరులు తెంచకురా ! ॥శి॥

॥అజ్జ చూచి చన్నుల దుమకురా ! నా
సెజ్జ గొలుసు బట్టి కదియకురా !
బుజ్జగించను. పసిగోలనురా ! కె
మ్మోవినొక్కకు భక్తురాలనురా ! ॥శి॥

మోము మోము బట్టి చేర్చకురా ! నీ
నామము తోడ బూది గూర్పకురా !
వేమరు తోడ భిక్ష వేడకురా ! పో
పోరా ! మన్నారురంగ ! మల్లాడకురా ! ॥శి॥

—పై దాని శృంగారమంతయు, బట్టబయలుగానే యున్నది. వ్యాఖ్యానమవసరమే లేదు. 'జావళీ' లలోని శృంగారమునకీ మచ్చు జాలును. ఘనం సీనయ్య గారింకను తగ్గు స్థాయికి దిగలేదు. దిగిన మహనీయులకుఁ దక్కువలేదు. 'తిల్లానా' లు మరికొన్ని వీనియందును 'అనుపల్లవి' పల్లవి తక్కిన యంగములు నుండును. సాహిత్య మంతయు మధ్యమ కాలమున బాడుదురు. తిల్లానాలలో స్వరములు జతులు, ఇవే. సాహిత్యమును కొద్దిగా నంజు కొందురు. ఉద్రేకమును రెచ్చగొట్టు రచన.

## కానడ-ఆది

ద ని ప గా మ రి స గ గ మ దా ని ప మ ద ని స ని పా గా మ రి స
గ గ మ దా ని
ద ద న దీంతనన తదర తారదని ఉఉద అన దీంతనన
త ద న తార

సమ మమ్మమ దద్దని సససస సససస ససససా
సరిస పా నిద
దని తాహత కుందరి తకుందరి కిటతక తననధీం
తదిర నాతక
పమ సససరిరిని నిసస దదనిని పమపా సరిససినిసా
పదపమపా సరిగమపా
దిమి తకదిమి తకఝుణ తకతధి గిణతొ తదిగిణతొం
తదిణతోం తదిగిణతొం

**చరణము**

దనిప గామరిస గమ దానిపా దనిసనిపా
మనవి చేకొ . న్న మన సారగా మన . వి
గా మరిస గమదానిపా గమదని రిసా నిసరిగ
మరిరిస పదని పామ
చేకొన్న మనసారగా నినునమ్మితినీ శ్రీ....కృ
ష్ణ.... భూ.. పాల
నిగమ రిరిస॥
ర... జేంద్ర॥

తాళము సరిపోవుటకు 'శ్రీకృష్ణభూపాల రాజేంద్ర' యను దాని యామ్రేడనము; గాయకునకు మృందంగ భాషతో పరిచయముండవలెను. జతులు కొన్ని పాఠమై యుండవలెను. లేకున్న 'స్వరప్రస్తారము'న కష్టముగల్గును. 'పల్లవి', బాడుటకు, "మర్దలతాళగతులు" దెలియనిది, రక్తిగా నుండదు. ప్రక్తవాద్యములకు, సాహిత్యము తోడిపరిచయము మంచిది. లేకున్నను నిర్వహించికొనవచ్చును. గాయకునకు మాత్రమట్లుసాధ్యముగాదు. ఇదంతయు ప్రధానముగా, రాగమునకు సంబంధించిన సామగ్రి. రాగజ్ఞానమును నిల్పు



కొనుటకుఁ బ్రాచీనులు బడిన యవస్థలు; విద్యార్థి ముందుసరళీ వరుసలారంభించును. అటుపై, జంటలు, దాటువరుసలు. తర్వాత నలంకారములు. వీనిలోఁ గొంతతాళ పద్ధతియునుండును. పిదపగీతములు, రాగసామాన్య పరిచయమునకు; వీనిలో లయయొకచే రీతిగా నడచును. పల్లవి మొదలైన భాగములుండవు. సంగతులులేవు. రాగములోఁగష్టములైన సంచారములకుఁ దావులేదు. సామాన్యముగా, స్వరభాగములోఁ బ్రతిస్వరమునకును, సరియైన యక్షరము సాహిత్యభాగములోనుండును. సాహిత్యభావము దైవభక్తి, మొదటి నుండి కడవరకు నిలుపక పాడుటయే గీతగాన పద్ధతి. 'అయ్యా, తియ్యా' యిత్యాదులు గీతములలో వాడుదురు. వీని కర్థముండదు. కాని, శ్రుతిపేశలముగా నుండును. కొన్ని శ్లోకములను గూడ 'పిళ్ళారి గీతము'లుగా పాడుపద్ధతిగలదు. 'శ్రీరామచంద్రః శ్రితపారిజాతః అమరీకబరీభార', యిత్యాదులు, గీతములుగా మారినవి. కొంతకాలము గీతరచన సంస్కృతముతోబాటు, 'భాండీర', భాషలోగూడ నుండెడిది.

**శుద్ధసావేరి, త్రిపుట**

॥ఆనలేకరవుని బోలితి, సకలశాస్త్ర పురాణదీనం
తాళదీనం తాళపరిగతురే
సేతువాహో పరిగతం నం జటాజూట
సకలశాస్త్ర పురాణదీనం. తాళదీనం
తాళపరిగతు, పరిగతం నం॥

దేశభాషలలో రచనలు వచ్చిన తర్వాత భాండరీభాష తగ్గిపోయినది. గీతములు, 'సామాన్య గీతములు, లక్షణ గీతము'లని, యిబ్బెడెుగులు, లక్షణ గీతములో, ఆ రాగమే మేళకర్తలోఁ బుట్టినది. భాషాంగమా, ఉపాంగమా, అన్యస్వరమేమి ?, మొదలైన సమస్త విషయములుండును.

### శహన. మఠ్యతాళము

॥శహాన రాగం, కాంబోజిజన్యం, కంపితగాంధారం, దీర్ఘమధ్యమం
చతుశ్శ్రుతిధైవత, కైశికీనిషాద, కంపితలసితం
వక్రసంపూర్ణం, గురుమూర్తే! చిద్రూ
పార్జున సారథే! భాషాంగరాగం. శృణు! జయకృపాళో !॥

—గీతములు రచించుట, వానిని బాడుట యొకనాడు పెద్ద విద్వత్తు. పైడాల గురుమూర్తి శాస్త్రిగారు, వేయిగీతములు రచించిరి. వారిపేరే యదియైనది. గోవింద దీక్షితులు, వెంకటమఖి రామయామాత్యులు మొదలగువారు, గీతా రచయితలు. నాదమెట్లు సంగీతమునకు బ్రాణమో, తాళముగూడనంతే. సర్వచతురశ్రమైన యాదితాళము చాల ప్రాచీనమైనది. ధ్రువమఠ్య, రూపక, జంపె, త్రిపుటలు వీనికిం జేరినవి. ఏకతాళమును; మరలనివి చతురశ్ర తిశ్ర మిశ్ర ఖండ సంకీర్ణ జాతులుగా నైదురీతులు. దీనితో ముప్పదియైదు తాళములయ్యెను. కొన్ని దేశి తాళములు. మఱల శాస్త్రముతో బాటివియు నెదిగి-యష్టోత్తరమై హనుమంతుని తోకయైనది. కాని-యీ శాస్త్రీయములను-బ్రాచీనులే చాలవఱకు వదలిరి. ఎవరో చాదస్తులు మార్దంగికులు-గాయకులు తగవులాడుకొనుటకు మాత్రమే వాడెదరు. తాళమునకు దశప్రాణములున్నవి. పదియు గాకపోయినను-గొన్ని ప్రాణములైనను మనకుందెలియవలెను. అట్టి వానిలో 'గ్రహ'మొక్కటి. దీనినే తమిళమున 'యెడుప్పు' అందురు. మొదటిది సమగ్రహము అనగా పాటయును-తాళమును ఒకేసారి యారంభమగుట. త్యాగయ్యగారి వినతాసుతవాహనుండై యను కృతి సమగ్రహము. విషమగ్రహము - తాళముగాని - పాటగాని మొదట నారంభించి, తరువాత నన్యతరమారంభించుట. తాళము నారంభించి, కొంత విశ్రాంతితో పాట నారంభించుట నాగత



గ్రహము. సదాశివ బ్రహ్మేంద్రులు రచించిన మానస సంచరరే యను పల్లవి నొకమాత్ర విశ్రాంతితో నెత్తికొందురు. త్యాగయ్య గారి 'రామా; నీయెడ ప్రేమరహితులకు' ననుకీర్తనను ద్విమాత్ర కాలము వదలవలెను. వారిదేయైన 'ఓరజూపుంజూచేది న్యాయమా!' యను దానిముందు మూండు మాత్రల కాలము వర్జము, 'పల్లవి' సమగ్రహమైనచో ననుపల్లవి విషమగ్రహముగా వచ్చును. మరల చరణము సమగ్రహములో నుండవచ్చును. కొందరు-ప్రౌఢిమకై సమమును, విషమముగా మార్చుటయుగద్దు. విషమమును సమము జేయుటరుదు. పండితులు విషమదృక్కులుగదా! పాటను తాళముకంటె ముందే మొదలుపెట్టుట అతీతగ్రహము. సాధారణముగా కృతుల మొదటిలో నతీతగ్రహముండుటరుదు. పాటల మధ్యలో మాత్ర మక్కడక్కడ వచ్చును. త్యాగయ్యగారు 'మధ్యమావతిలో' వ్రాసిన 'వినాయకునివలెను' అనుకృతియున్నది. అలసటలేని యాదితాళము.

**ఇందులో చరణ మిక్రిందిది :**

" పురాణి దయ సేగిరాలు మా,కుని
కి,రా జేసి, బ్రోచురాజధరి! త్యా
గరాజుని హృదయ సరోజమేలే
శ్రీరామ సోదరి! పరాశక్తి నను ॥వి॥

ఇక్కడ 'ర' కారప్రాసము చెవులకింపుగానున్నది. తాళము రెండవ యావర్తములో 'త్యాగరాజు' అనుచోట 'త్యా' అనునక్షరము మొదటి యావర్తముయొక్క యుసి లోనికింబోవుచున్నది. 'గరాజుని'యను దానితోందాళమారంభమగును. అట్లుగాక 'త్యాగరాజ'అని తాళమారంభించినచో 'ప్రాస'యొక్కసొంపు చెడును. 'కృతి'యతీతగ్రహములో నరుదంటిమి. రాళ్లపల్లి యనంతకృష్ణ శర్మగారిదొక కూర్పున్నది. వాని యెత్తుగడయే యతీత గ్రహము.

కాంభోజి, మిశ్రచాపు

॥హరిణీ ! హరిరమణీ ! మమదురితమనిశముపశమయ తు॥
॥కరుణా రసధునీ ! కమలా ! కామజననీ ! ॥హ॥
॥ఆనందరసమయీ ! అఖిలాండేశ్వరి ! (పరమానంద)
వీణామృదుగదనా ! వికచాంభోరుహ సదనా ॥

—శర్మగారు సంగీత సాహిత్య తంత్ర స్వతంత్రులు. వారి గానలాక్షణికత దక్షిణదేశ విద్వాంసులకే తలమానికము. పై వానిలో "ముద్ర—"లేదు. అనవసరమనుకొన్నారేమో ! తాళమునకు మరియొక ప్రాణము, లయశుద్ధి. అనగా, విలంబిత, మధ్య ద్రుత కాలములలో నేకాలములలోఁ గృతి నెత్తికొన్నాడో, దానినట్లే కడవరకు నిర్వహించుట ! అనేక మంది విద్వాంసులకే, దీనిపై నధికారముండదు. విలంబ కాలమున మొదలుపెట్టి మధ్య కాలమునకు దిగుదురు. ముఖ్యముగా-మృదంగకారు డీదోషమునకు బాధ్యుడా! యనిపించును. అతడు-జాతులు మార్చికొనుచు వీరవిహారమొనర్చునపుడు ఆ ధోరణిలోఁబడి గాయకుఁడు తాళమును ముందుకు జరుపుచుబోవును. తన 'లయశుద్ధి'ని గాపాడుకొనుటకు గాయకునకు సంయమనము గావలెను. ఇక మిగిలినవి యతులు. అంగములు సమానమైన విలువ గలవిగానున్నప్పుడు-దానిని సమయతియందురు. 'సరిగరి-గమపమ' లేక-'సారీగామా గామాపామా' యిట్టివి. 'గోపుచ్ఛయతి తరువాతిది. ముందు వెడల్పుగానుండి-రానురాను-ఆవుతోకవలె సన్నగానగును. స్వరసాహిత్యములలో దేనియందైన నివి యుండవచ్చును. సాహిత్య గోపుచ్ఛయతి యీ క్రిందిది-

"త్యాగరాజ యోగ వైభవం
రాజయోగ వైభవం



యోగ వైభవం
వైభవం
భవం
వం

ఇట్లు దగ్గించినపుడు-వీనికి సరియైన యర్థముండునా? అది లేనప్పుడిది ప్రేలాపనగదా! ఈ వాదము సరియైనది గాదు. ఒకరికి మరియొకటి ప్రేలాపన. 'సంగీతమందు-సాహిత్యముయొక్క యధికార మెంతవఱకు'? అనునది సహృదయతతో-ముందు దేల్చికొనవలెనుగదా! ఆ విషయముపైన చర్చించికొందము. ముందు-వారి విలువలేమో దెలిసికొందము. తరువాతిది 'స్రోతోవహయతి' ఒకానొక నది పుట్టుకలో సన్నగానుండి క్రమముగా విస్తీర్ణమగును, అట్టిదీ యతి.

రి స
మ రి స
ప మ రి స
ద ప మ రి స
ని ద ప మ రి స
స ని ద ప మ రి స

దాని స్వరూపము పై దానివలె నుండును. గోపుచ్ఛయతిని త్రిప్పి చూపినచో-నదియే స్రోతోవహయతి. ఇట్లే-డమరుయతి-మృదంగయతి-విషమ యతులున్నవి. రాగాలాపన సేయునపుడు-గ్రహభేదమొనర్చుట మరియొక చిత్రము. ఒకడు శంకరాభరణము పాడుచున్నాడనుకొందము. ఆ రాగ స్వరూపము-చతుశ్రుతి రిషభ-అంతర

గాంధార-శుద్ధ మధ్యమ-చతుశ్రుతిధైవత-కాకలీనిషాదములు. షడ్జ పంచమములు లవికృత స్వరములుగదా! రిషభమును షడ్జముగాఁ జేసికొని, శంకరాభరణ స్వరములనే బాడిన 'ఖరహరప్రియ' యగును. గాంధారము షడ్జాయితమైన తోడి; 'మధ్యమము' షడ్జీకృతమైన 'కల్యాణి'; ఇట్లు మారుచుబోవును. ఈ రాగములు జూపించుచున్నను అనగా వినువారిని రాగ భ్రాంతిలో ముంచుచున్నను ప్రధాన రాగమును మరువక పాడుట దీనిపద్ధతి. గ్రహభేదము గాయకులకును శ్రోతలకును వేధ. కాని-పాండిత్యమనగా నన్నియుగావలెనుఁగదా! మరి!! ఇక-న్యాసస్వరములు. ఒక రాగములోని రంజక స్వరములేవో శాస్త్రము చెప్పినది. అవియే పలుమారు వచ్చునట్లు స్వరములు గూర్చుట. కాంభోజి రాగచ్ఛాయా స్వరములు మధ్యమ, ధైవత నిషాదములు. ఆ స్వరములే పలుమారు వచ్చునట్లు గూర్చిన రక్తి గట్టును. అటతాళ వర్ణములో—

మా......పదమా -పదనిదమా -పసనిదమా-దమాప -గమపా......
మా......యలమా-రికియభిమా-నముసతమా - రమార-మణమా...

ని ద ప మ-గ రి గ సా ॥
నమువుసు, రెయనుమా ॥

మధ్యమ మున్యాసము చేయబడినది. స్వరాక్షరముగూడ నిర్వహింపబడినది; ఇంత మేరకు-చేసిన వివరణముతో-సంగీతముయొక్క మూల పదార్థములేవో మీకు గొంత యర్థమైయుండును. కావ్య రచనలో—గుణములు-రీతులు-అలంకారములు మొదలైన పరికరములున్నట్లు వారికిని 'స్వరాక్షరము -గ్రహభేదము -న్యాసస్వరము యిత్యాదులున్నవి. 'యతులు' మొదలైన తాళ-ప్రాణములున్నవి; కనుక-సంగీత రచనలో విద్వాంసులు గమనించునది వానినెంత చక్కగా నడపినాఁడని; వానియందలి దక్షతలు నిర్వహించికొనుచు-సాహిత్య



మును సాధించికొనవలెను. 'సంగీతములో మా పెత్తనమున్నదిగదా!' యని దురాక్రమణజేసి, కావ్య రచనలోని వైవిధ్యము, లేదేఁ వ్యాకరణము చెడెనే'యని దెప్పి పొడుచుట-రసికులు చేయరాని పని. ఆయుర్వేద గ్రంథములున్నవి. వానిలో-వారిచ్చినంత సాహిత్యముతోఁ దృప్తిపడక - ధ్వన్యాలోకపు దుర్భిణీతోఁ జూచువాఁడు మూర్ఖుఁడుగదా! పైఁగా-సంగీత సాహిత్యములు రెంటియందును సమాన స్కంధులగుట-యెవరికో బట్టెడు నదృష్టము. అనంతకృష్ణశర్మ గారన్నట్లు సరస్వతీదేవి తన రెండు చన్నులను ద్రాపుట కాక్షేపణ జేయకున్నను-త్రావుట కష్టము. త్రావిన జీర్ణించికొనుటంతకన్న గష్టము. రెండును 'రసోవై సః' అను రసభావాశ్రయములు. ఒకదానఁ జేసెడు తపస్సునకే జీవితము చాలదు. ఒకడు రెండవ దానిలోనికిఁ దొంగి చూడవచ్చునంతే. ఎవరో మహా సంస్కారవంతులు శర్మగారి వంటి వారొకరిద్దరున్నను-వారికి రచనా లాలసత యుండదు. తమ యానందమే తమది.

త్యాగయ్యగారి పంచరత్న కృతులు ప్రసిద్ధమైనవే. వాని రచన ఘన రాగములలో సాఁగినది. శౌర్యవీర్యోత్సాహములున్న పురుషులనుఁబోలినవని లక్షణకారులు; అయిదు కృతులును ఆదితాళము ననే నిబద్ధములు. క్లిష్టములైన లెక్కాచారములలోఁ ద్యాగరాజున కభిమానము దక్కువ. కాని, వీని సాహిత్య స్వరబంధములలో వారికి సహజమైన సరళత లేదు. పచ్చిమిరియము ఆదెప్పయ్యగారి తానవర్ణము మనస్సు నాకట్టినట్లున్నది. ఆ పద్ధతి ననుసరించినాఁడు. నేటికిని-త్యాగయ్యగారి సమాధివద్ద పంచరత్న కృతులు గానముసేయు పద్ధతి యున్నది. సంగీత శాస్త్ర సంకేతములను-వానిలోని ప్రౌఢిమలను దెలుపుటలో నీయయిదు కృతులును జాతిరత్నములనవచ్చును. 'జగదానంద కారక!'యని 'నాట' రాగములోఁ గృతియున్నది. గాయకులలో నాటకు గౌరవము గద్దు. సంప్రదాయనిష్ఠులు-నాటతో గాన

మారంభింతురు సురటితో ముగింపు. నాట యేనాటిదో! మేళకర్త రాగము లేర్పడుటకు ముందు నుండి యున్నట్లున్నది. దీని తరువాత-భావగాంభీర్యముగల చిన్న పెద్ద రాగము లెన్నియో వచ్చినవి. కొన్ని యస్తమించినవి. మరికొన్ని రూపము మార్చినవి. ఎన్ని వచ్చినను 'నాట' మాత్రము తన యాచార్య పీఠమును వదలుకొనలేదు. 'నాద శుద్ధి'కి దీనిలో నున్నంత యవకాశము తక్కిన వానిలో లేదేమో! యనిపించును. గమకములతో నిమిత్తములేక-కేవల స్వరూప మాత్రముచేతనే రంజింపజేయు శక్తి దీనిది. ఒకనాఁడు దీనిని 'గంభీరనాట'యనెడువారు. శంకరాభరణ స్వరస్థానములతో-నౌడవ రాగముగా నుండెడిది, 'సగమ పనిస'యని- యారోహణము. 'సనిపమగస' యవరోహణము; నారాయణ తీర్థులు తరంగములలో 'నాట' రాగమిట్టిదే. ఈ క్రింది తరంగము ప్రసిద్ధమైనది.

**నాట-జంపె**

॥ నిగమగోచర! నిత్య నిర్మలానంద ఘన!
విగళిత మహామోహా! విమల విజ్ఞాన!
ఖగయాన సంచార! ఖండితా సుర నికర!
సకల గుణ సంపన్న! సత్యపరిపూర్ణ !
జయ జయ రమానాథ! జయ జయ ధరానాథ!
జయ జయ వరాహాపురి జయ వెంకటేశ!
మధుసూదనాఽనంత! మాయయా కృతభువన!
విధు దివాకర నయన! వేదాంత భవన!
విధిముఖ సురేంద్రనుత! విమల కల్యాణయుత!
విమల యోగిధ్యేయ! వివిధ మునిగేయ! ॥
మురనరక సంహార! మూఢమతి జనదూర!
పరిజన శివంకర! పరాపర శరీర!



నిరవధిక కారుణ్య! నిఖిలలోక శరణ్య!
సరస నారాయణ తీర్థ! సద్గురు వరేణ్య! ।జ॥

పైదానిలో సంగీతముకన్నను సాహిత్య ప్రౌఢిమ యెక్కువ. నడుమ చిన్నని కూనిరాగములఁదీయుటకుఁగూడ నవకాశముండదు. ఆవర్తమున కెన్ని మాత్రలో-అన్ని వర్ణములును-జంగాళముగ శయనించి యుండును. నాదమునుబట్టి యీడ్చుట కవకాశమేదీ? అవాంతర శ్రుతులు తలసూపుటకును-గమకములకును వీలేలేదు. మధ్యమ కాలములో గానము, దీనిని నృత్యమునకు జోడించినప్పుడు-తాళములోఁజిత్రముగా జాతులను మార్చి-జతులను తృప్తిగాఁబ్రదర్శింపవచ్చును. ఆవేగములో నభినయము జూపుటఁగష్టము. అన్నమయ్య యవలంబించిన సంగీతమిట్టిదే. తరంగములలోవలెనే యనుస్వరములకుఁజోటేయుండదు వీనిని చక్కని సాహిత్య ఖండికలనవచ్చును. దీక్షితులు - శ్యామాశాస్త్రులు - త్యాగరాజు, మొదలైనవారి సంగీతమిట్టిది గాదు. వారికి నాదము ప్రభువు. సాహిత్యము పరిచారకుఁడు.

శంకరాభరణములో చెలామణి యగుచు వచ్చిన 'నాట'కాలక్రమమునఁగొంత మారెను. షట్ఛ్రుతిరిషభమును-షట్ఛ్రుచి ధైవతమును ప్రవేశించినవి. 'రిషభ' ధీర గంభీర ధ్వనికి శరీరము బులకరించును. శరత్కాల గర్వమంతయు గూడుగట్టిన వృషభముల అంకెవలె; 'మ,ని' యనునవియును-రాగచ్ఛాయా స్వరములైనను 'రిషభమే మహారణ్యమున సింహమువలె-విశంకటముగ సంచరించును; త్యాగరాజు నాట-యారోహణమున సంపూర్ణము, అవరోహణమున నౌడవము. 'జగదానంద కారక'యను నాటరాగకృతి-స్వర నిర్మాణ దృష్టితోఁజూచినచో-గొప్ప రచన. రాగ త్రయోదశ లక్షణములను తాళదశ ప్రాణములను దృష్టిలో నుంచికొని కూర్చిన కూర్పిది.

షడ్జమునుండి యారుశ్రుతుల దూరమందున్న రిషభము-దానికి సంవాదులైన పంచమ ధైవతములను జూపినపుడు-దాని గాంభీర్యమే గాంభీర్యముగ నుండును. రిషభము కంపిత స్వరము. సంపూర్ణమైనను 'సగమపని'యను ప్రయోగమే రక్తి నిచ్చును. రిషభమెక్కువ భాగము గాంధారమునుండిగాని-షడ్జమునుండిగాని వచ్చును; ఈ రాగమున స్వరములన్నియు తీవ్రములు. షడ్జపంచమములు-గ్రహాంశ స్వరములు. రిషభ మధ్యమములు-అంశ న్యాస స్వరములు. చతురశ్రగతి నాధారముగా నుంచికొని-త్రిశ్రఖండ జాతుల నడకలనెన్నిఁటినో జూపవచ్చును. ఈ కృతి యెత్తుగడలోనే-గ్రహ స్వరమునుండి-రాగ ఛాయా స్వరమునకు-సింహ కిశోరమువలె లంఘించుచున్నది. 'ఆనంద మాకాశమంత యెత్త'ని చూపించుచున్నట్లు మృదంగమునకుఁబండుగలైన యెన్ని నడకలో-యీ స్వరములలో నున్నవి.

॥ పాని-పానిపమ-మాప-మాపమగ-గామ-గామరిస
తాంత-తాంతకిట-తాంతం తాంతఝుణు-తాంత తాంతఝుణు
సాపా-మారీ-సపామ-రిసపమ
తద్ధిం త్తాత-తద్దీంత-తకఝుణు
సరీస-మగపమ-నిపామ-గమపని
తధీంత-తకధిమి-తధీంత-తకఝుణు
పసస-సానిపా-మరిస-సారిగమ
తకిట-తాంత-తాతకిట-తాంతకిట.

నిగమ-నీరజా
తకిట-ధీం తధీం
ఇంద్ర నీలమణి
ధీంత ధీంతనన



'ఓంకార పంజరకీర' అనునది-తార షడ్జములో నెత్తికొన్నప్పుడు-ప్రణవమెక్కడో-సత్య లోకములలోఁబలుకుచున్నది. 'పాదవిజిత' యనుచో స్వరాక్షరము.

రీ
ప మ రీ
ని ప మ రీ
స ని ప మ రీ

-యనుచోట స్రోతోవహాయతి. "కలశ నీరనిధి జా రమణ" యనుచోట నున్న మంద్రస్వరముల కూర్పు నీరనిధి యొక్క లోతులు తడవి చూచుచున్నట్లున్నది. ఎత్తుగడలోనే "జగదానంద కారక!" అనుదాని సంగతులతో నాకాశము వరకు మెట్లు గట్టినాఁడు. సంగీత విద్వాంసులకీ యందములకు మురిసిపోవుటతోనే సరిపోవును. సాహిత్యభాగమును గమనించు తీరిక యేది?

నాటరాగకృతిలో నన్నియు సంబోధనాంతములే. రాముని తో నేరుఁగా బలుకుచున్నట్లు. దీనిలోని సాహిత్యమును సంగీతమునుండి వేఱచేసి పరీక్షించుట "యెక్సురే" దీయుట వంటిది. ఇదియేగాదు-యే కీర్తనయైన నింతే.

"అగణితగుణ! కనక చేల-సాల విదళనా!
అరుణాభ సమాన చరణ! అపార మహిమాద్భుత!
సుకవి జన హృత్సదన! సురముని గణవిహిత!
కలశ నీరనిధి జా రమణ! పాపగజనృసింహా!
వరత్యాగ రాజాధినుత!

-పై చరణములలోని ధాతుమాతులకున్న యొద్దిక యపూర్వమైనది. సాహిత్యకముగఁ జూచినను పై చరణములలో శాలి క్షేత్రములపై

ఁజిలుకలవలె నన్నియు లఘువులే గుంపు గట్టికొన్నవి. “పాపగజనృసింహా!” యనునది వీరావతారుఁడైన కోదండ రామునిఁగనుల యెదుట నిలుపుచున్నది. “గగనాధిప సత్కులజ,” యనుచోట తార షడ్జమము. సూర్యుఁడు చాలా యెత్తని చెప్పుచున్నది. “కవీనవిలజ మౌని కృత చరిత్ర” లోఁ గ్లిష్టమైన పాండిత్యపు దుర్వార గంధము 'అనురాగ రాగరాజిత కథా సారహిత' ముద్దైన శబ్దాలంకారము. 'ఖగ తురంగ' లాక్షణిక ప్రయోగము. 'అమరతారక నిచయ కుముదహిత తేజస్వరూపులైన దేవతలను చుక్కలతోఁ బోల్చి వారిలోఁ గాముఁడు చంద్రుఁడనుట మట్టసమైన యలంకారము. ఇశ్లే రెండవకృతి - యారభిలోనిది. ఇదియుఁ దానవర్ణ మార్గమే. పల్లవి అనుపల్లవి చరణము స్వరసాహిత్యములు. అనుబంధ మనెడివర్ణములోని యంగములు ఉపాంగములు తీరు తియ్యములతో ప్రతిబింబించినవి. ఈ రచనలో ఆరభి — రాగము మహాప్రవాహమైనది. యెత్తుగడ పంచమ మధ్యమములతో నారంభము. ఇవి యత్యున్నతములుగావు అతి నిమ్నములును గావు. అనుపల్లవి మధ్య షడ్జము నుండి తారమధ్యమమునకు నీటి బుగ్గవలె నెగయుచున్నది. చరణములలో సమప్రవాహమై స్రోతోవహ యతిలో రాగకళను వెదజల్లి కొనుచు 'నారభి' రసికజన హృదయశాలి క్షేత్రములకుఁ బారుచున్నది. చరణములలో స్వరముల నడకలోఁ బ్రయోగములు యుగళాలంకారములు వెల్లివిరిసినవి. ఈ క్రిందివి మృదంగమునను వేడుకలు.

1. ధా ధా స సారిరీ-సరిమ ॥స॥
   సంగీ త . సంప్రదా - యకుఁడు॥

2. దరిరి సరీ దాసపాద మాపమ గరిరిమ ॥
   ముదంబు నను ముద్దువెట్ట నవ్వుచుండుహరి ॥

—ఈ క్రింది గమనములోని వైలక్షణ్యము గుర్తువెట్ట దగినది



1. రిమప దాప, మపదదప (మగమపా) మపదపా
2. పామగరీ దాదా పమగరిరీ
3. దదపా సనిదా రిసా సమగరీ
4. ససాస దద పప (పా) పమగరి సరిమ ॥స॥

సాహిత్యములోని “హరేరామచంద్రా !”, “శ్రీ వెంకటేశ!” యను చోటులలోని స్వరసాహిత్య సమ్మేళనము రసికులు కనుమూసి యానందింపఁ దగినది. ఇఁక మూఁడవకృతి. “ఎందరో మహానుభావులు”. షడ్జముతో నెత్తుగడ. అందరి మహానుభావులకుఁ బేరుబేరున దలవంచి మ్రొక్కుచున్నట్లున్నది. దీనియందు నాద సిద్ధికి “మానస వనచరవర సంచారము” నిలిచి పోవలసినదే!

త్యాగయ్య తెనుఁగు దేశమునకు జాతికి నిల్పిపోయిన పెన్నిధులు మూఁడు. రామభక్తి సామ్రాజ్య మొక్కటి. సారమైన సంగీతము మరియొకటి “సుధామాధుర్య భాషణ” సుకవిత్వము మూఁడవది. అతని భక్తి ముక్తులతో మనకేమి సంబంధము! దాని మంచిచెడ్డలాతనివని వింతవాదము సేయవచ్చును. నిజమే! దేనితోమాత్రము మనకేమి లాభము! సంగీతమేమి యిచ్చును? “సంగీతము మరగి బేర సారము లుడిగెన్” యనునొక సామెత యున్నది. కవిత్వము మాత్రమేమి యొఱగ బెట్టును! మూఁడును మనస్సంస్కారమునకు సంబంధించినవే. మనస్సంస్కారమునకును మనుగడకును సంబంధమేమి? యన్నచో నిక దర్కమే లేదు. చదువున కుద్యోగమే ఫలమను వారిని మన మేమి చేయుచున్నాము? ఉత్తమ సంస్కారముతోడిదే జీవితమనుకొను వారికీ పై మాటలు. అతని భక్తి యతనిదే యైనను దానినిఁ గూర్చి తెలిసికొనుట అనుసరించుట జన్మఫలమనుకొను చున్నాము. అతఁడు సాధించిన మార్గమేది? దీక్షిత శ్యామ కృష్ణులవలె తంత్రమార్గముగాదు. దానికి మరుగులు లేవు నరు

లందరికి దెలిసిన నామజపము, దినమునకు లక్షయెనిమిదివేలు. కోదండ పాణి యగు రాముడు తొంబది యాఱుకోట్లగు వఱకును దర్శన మివ్వలేదు. వచ్చు వఱకును త్యాగయ్య సాధన వదలలేదు. జీవిత నిర్వాహము ఉంఛవృత్తి "నిధి చాల సుఖమా! రాముని సన్నిధిసేవ సుఖమా! యని రానున్న సంపదను కాలదన్నిన రాజీపడని వైరా గ్యము, కాని లోకమున కీ వైరాగ్యమేమిపట్టినది? సోమరియన్నారు వేషమన్నారు. కూడబెట్టుట కిది యొక యెత్తన్నారు. అతఁడెవ్వరితోఁ జెప్పికొనును? 'నాదుపై బలికేరు నరులు. వేద సన్నుత! భవము వేరుసేసితి నంచు" అని రామునితోఁ జెప్పికొనెను. ఆ రాముడిట్టి వారి నెందరినిఁ జూచినాఁడో? అంత తొందరగా బలుకునాయేమి? "నిద్దుర నిరాకరించి ముద్దుగా తంబూర బట్టి" యెన్ని రాత్రులు రోదన రాగములు దీసినాఁడో! భక్తిసాధన యెడారిలోని సేద్య మైనది. పిలిచిన పలుకని వానితో నేమి? ఊరకున్న సరిపోయెడిది. ఊరకున్నచో? (జెడిపోవుటయే గదా. పైగా 'నారూపము ప్రతా పము శరచాపము సల్లాపము' తన పాలిటి కురులై కూర్చున్నవి. లోకమునకు ధర్మావతారుఁడై ననుతనమనస్సునకుఁ "ప్రేమావతారుఁడై "పీటవెట్టినాడు" మనసు వానిపై మరలుగొన్నది" రామకథాసుధా రస పానమొక రాజ్యము జేసు 'నన్న పిచ్చి' బ్రహ్మానందము లేకనా? మహర్షులీ కథ వెంటఁబడినార' ను తర్కమునకు లొంగని విశ్వాసము. 'శివధనువును విఱిచే వేళ అలకలల్లలాడెడు ఆ ముఖమండలమునుగని ఆరాణ్ముని యెంత పొంగెనో యాయదృష్టము దనకెపుడని యెదురు తెన్నులు జూచు చూపులు, "నీ వంటి దైవము నేగాన" నని పొంగి "పోవును. ఎవరెవరితో నేమని మాట్లాడితివో" నని చింతా సంతాన ముల్లి కొనును. "మా జానకి చెట్ట బట్టగ మహారాజువైతి" వని యాసడించును. "నా మనసు విడజాలదురా!" యని దీనముగ నేడ్చును. "శ్రీ రామపాదమా?" యని రాముని పాదము బట్టుకొని



ప్రేలాఁడును. "అయ్యో! నామ జపము జేసితిని లాభమేమి? రాముని యందు చాలినంత ప్రేమ యెక్కడేర్పడినది? రామచంద్రా! నీ యెడ ప్రేమరహితులకు నామరుచి దెలియునా? "కామిని వేష ధారికి సాధ్వీనడత లేమి తెలియు" నని సాధనపైన తృప్తి. 'మనసా యెందుకీరీతి నా కెదురు తిరిగెదవు? నన్నేడ్పించుట నీకు మంచిదేనా? చేతిలో మాల దిరుగుచున్నది. నీవేమోయూరుజుట్టు చున్నావు.

పూర్ణచంద్రిక, ఆది

॥తెలిసి రామ చింతనతో. నామము
చేయవే! మనసా!
॥తలపులన్ని నిలిపి నిమిషమైన
తారక రూపుని నిజతత్వములను ॥తె॥

॥రామాయన చపలాతులపేరు
కామాదుల పోరువారు పేరు
రామాయన బ్రహ్మమునకు పేరు
ఆ మానవ జననార్తులు తీరు ॥తె॥

॥అర్క మనుచు జిల్లేడు తరుపేరు
మర్కట బుద్ధు లెట్లు తీరు
అర్కుడనుచు భాస్కరుని పేరు, కు
తర్కమనే అంధకారము తీరు ॥తెలి॥

అజమనుచు మేషమునకు పేరు
నిజకోరిక లేలాయీడేరు
అజుడని వాగీశ్వరునికి పేరు
విజయము కల్గును త్యాగరాజనుతుని ॥తె॥

—కాని, ఆ మనస్సు నిలుచునా? దాని దారి దానిది. ఏమి సేయ వచ్చును? త్యాగయ్య మనస్సులో భీతి జెందును. 'రామయ్యా! నా చరితమే కర్ణకఠోరము. పట్టి గొడ్డురీతి భక్షించి తిరిగితిని, పొట్టకై పుట్టు లోభులను పొగడితిని. దుష్టులతోఁ గూడితిని. దుష్కృత్యములు సలిపితిని. అట్టుబడితిని, ఎటుల బ్రోతువు!" అని చదికిల బడును "మనసు నిలుప శక్తి లేకపోతే" రాముఁడు మాత్ర మేమి సేయును. "సోమిదమ్మ సొగసు గాండ్ర గోరితే సోమయాజికి స్వర్గ మెక్కడిది?" అయ్యో! నా జీవిత మిట్లే గడచిపోవుచున్నది. "నిద్దుర కొన్నాళ్ళు! విషయబుద్ధులు కొన్నాళ్లు" "ఎద్దు రీతికన్న తావుల భుజించి యేమి తెలియక కొన్నాళ్ళు, "పద్దు మాలిన పామర జనులతో వెఱ్ఱి పలుకులాడుచు గొన్నాళ్ళు!" యాగాది కర్మములను సేయవలెనని పేరాస. శ్రీరాముని తత్వముసే పట్టించుకొనక కొన్నాళ్లు తనకుఁ దెలివి వచ్చుటెప్పుడు? రామచంద్రా! నా బాధ నీవు గమనించుటయే లేదు. నీ వెక్కడున్నావో! ఎక్కడికి వచ్చిన నిన్ను బట్టుకొందును? నీకు నిలుకడ యెక్కడ? సీతా గౌరీ వాగీశ్వరులను స్త్రీ రూపములలోననా? శివమాధవ బ్రహ్మాదులందా! బలే దేవుఁడవు? "నీ మాయలెంతో బాగాయె నయ్యా!" నీ సావాసము వద్దు. మఱ యొక్క-దేవుని బట్టికొందును. అంతలో విరక్తి. కాని మనస్సే యెదురు తిరిగినది. "వాఁడేరా! దైవము" వేరొక్కఁడు కాఁడని "చెప్పుచున్నది. 'రామా! నిన్ను విడువను. "కాసు వెదుకఁబోగా రత్నము వలె జిక్కితివి. "అంబలి తినువేళ నమృతమై" యబ్బితివి. "ఆడబోయిన తీర్థమెదురైన రీతి" యీడుజోడులేని యిష్టుఁడవై" నావు. "సిగ్గువోయినవేళ చీరల లబ్బినరీతి!" జిక్కినావయ్యా! నీ భక్తి లేని దెన్ని యుండిన నేమి! "రూకలు పదివేలుండినను నూకలు చేరెడే!" కోకలు వేయున్నను కట్టుకొనుట కొక్కటే!" ఊరేలినను దాను బండుకొనుట మూరెడు



తావులోనే!" నూఱు భక్షణములున్నను నోటి కొక్కటే! పరు నిండి పారినను పాత్రకు తగునీరే! మరి యీ జనులెందుకింత పిచ్చిపట్టి డబ్బునకై యెగ బ్రాకుచున్నారు. ఏమో! ప్రపంచమును జూచి బాధ. తన్ను జూచి బాధ. ప్రతి భక్తుని జీవితమందు నీ తపన తప్పదు. రామ భక్తి కలుగును! భక్తిలేని జీవితమెందులకు? ప్రాణము లేని వానికి బంగారు పాగా జుట్టిననేమి? ఆణివజ్రభూషణ మురమందు బెట్టిననేమి? వేదశాస్త్ర పురాణాగమ ప్రసంగత్రాణ గల్గిననేమి? ఆ భక్తి నెవ్వరిత్తురు? రాముఁడే యివ్వవలెను. "భక్తి భిక్షమివ్వరా!" అని రాముని వెంటబడినాఁడు. కడకు "తత్త్వమసి" యను సూత్రమే రామానుభూతియని తీర్మానించికొన్నాఁడు. పరమాత్ముఁడే రాముఁడు. తుదకు "యింత కన్నానందమేమి" అను స్థితికి వచ్చినాఁడు. దాసభక్తి-సేవాభక్తి 'జీవగర్ర'యైన త్యాగరాజు తన యున్మాదములో నపుడపుడు-మధుర భక్తిలోఁగూడ నడుగువేసినాఁడు.

॥ ముఖజిత సోమా! మోహన రామా
మోహము నీపై మొనసియున్నదిరా !

యని లోక మర్యాదా భయముతో నడుగునఁబడిన జీవధర్మమును బైటఁబెట్టినాఁడు.

। పతి కోపించితే మానవతియైన నిజ
సతిరీతి నడచుకోనా !
॥ రూకలొసఁగి కొన్న సతిరూప మెట్లున్న
శ్రీకర గుణమున్న 'చెలి చెలిమి వీడరన్న ! ॥

యని తన పతివ్రతాత్వమును బుజువు సేయుటకుఁబూనుకొన్నాఁడు.
కడకు-

సౌరాష్ట్రి — దేశాది

॥ నేరమా! రామ! రామ! నీకిది
నీరజాక్ష! నా జీవాధార ॥నే॥

॥ మారకోటి సౌందర్యమునుగని
మదిలోన సుంత మరవియుంటే ॥నే॥

॥ కోరి కోరి నీదు కొలువు సేయువేళ
సారమైన పదసారసముల పొం
గార జూచి, యురమున నుంచుదామో!
కనుల నొత్తుదామో! యని
కూరిమిని బ్రహ్మానందమందుచును
కొంత మైమఱచి యుంటిని గాని
తారకాధిపానన! పావన! సీ
తానాయక! శ్రీ త్యాగరాజునిపై ॥నే॥

యని దశమస్కంధ గోపికయైనాఁడు. రామకృష్ణుల కభేద భావము-పోతన్న శిష్యునకందించిన మహాప్రసాదము. ఆ బలముచే త్యాగయ్య గోలోకమునో-దివ్యసాకేతమునో విలిచికొన్నాఁడు.

త్యాగయ్య మన పాలికి నిల్చిపోయిన పెన్నిధులలో సంగీతమే ప్రధానమైనది. అతని సంగీత మమృతభాండము ఆ యమృతము దరుగనే తరుగదు. ఒక్కొక్కతూరి యాతనికి సంగీతమందుల్లాసమధికమగును. ధాతురచన తెరలు తెరలై దోచును. దాని యావిష్కారమునకుభక్తి, సాహిత్యములు దోడై నడచును. ఒకసారి భక్తి యుద్రేకించును. "మనసులోని మర్మమును దెలిసికో"మ్మని, వెంటఁబడును. సంగీత కవిత్వములు పసర్జనీ భూతమగును. కవిత్వకళ ముందైనప్పుడు-భక్తి సంగీతములు తెరవెనుక నుండును. ఈ త్రివేణీ సంగమమును-మనమాతని రచనలలో స్పష్టముగఁజూడవచ్చును. ఈ మూటి నాతఁడాత్మోద్ధరణకై వినియోగించికొన్నాఁడు. ఇది త్యాగయ్యకుఁబెద్దలనుండి సంక్రమించినయాస్తి. అతని తండ్రి రామ



బ్రహ్మము. రామాయణ భారతాది పురాణ కాలక్షేపములలోఁ బ్రసిద్ధుఁడు. తంజావూరు మహారాజుల సన్నిధిలో రామాయణ ప్రసంగములొనర్చి, శ్రీరామనవమి గర్భోత్సవములు సేయించినవాఁడు. అనేక సన్మానములందినవాఁడు. ఆ వచ్చిన ధనముతో నాతఁడు ప్రతి వర్షమును-శ్రీరామోత్సవములనింట జరిపించుట వాడుక.

త్యాగరాజు తాత 'గిరిరాజ బ్రహ్మము'. సంస్కృతాంధ్రములలో మంచి పండితుఁడు. సంగీతముతో సాహిత్యమునకు మెఱుఁగు వెట్టికొన్నవాఁడు. భక్తి వేదాంత పురస్సరములైన కొన్ని కీర్తనలు తెలుఁగులో రచించెనట! 'వారిదని' యొక కీర్తన సుబ్బరామ దీక్షితులు తన గ్రంథ మందుదాహరించికొన్నాఁడు. గిరిరాజ బ్రహ్మము రచించిన 'యక్షగానములు' గొన్ని, సరస్వతీమహాలులో నున్నవట! వారి తండ్రి 'పంచనదబ్రహ్మము'గూడ రామాయణాది కాలక్షేపములలో నిపుణుఁడు. ఈ రీతిగాఁదండ్రి తాతలనుండి-సంక్రమించిన యాస్తులైన రామభక్తి, సంగీత సాహిత్యములు-త్యాగరాజును విడువకపట్టుకొన్నవి. తక్కిన వారందఱును-భక్తిఫలముగా-భుక్తి ముక్తులకై ప్రాకులాడునప్పుడు - త్యాగరాజు ముక్తికిమాత్రమే యంగలార్చినాఁడు. అతఁడు జీవించిన దేశము-కుక్కలు పీకినవిస్తర వంటిది. ఒకవైపుఁజిన్న చిన్న రాజులు-వీరివంటి జమీందారులు-పట్టపగలే దోపిడికాండ్రైనపాళెగాండ్రు. చాలని దాని కూళ్ళపైఁబడి దోచికొనెడి దొంగలు. ఆ రాజునకు యీ రాజునకుఁదగవు పెట్టి తమాషా చూచు కుంపిణీ దొరలు. ఇట్టి కాలములో-యే రాజునో-అధికారినో-యాశ్రయించి, అడుగులకు మడుగులొత్తనిది జీవితములు జరగెడివి కావు. ఆ సమయములో

"దుర్మార్గ చరాధములను
'దొర' నీవనఁజాలరా!"

అనెడు హాతము. శ్రద్ధ, నిర్లక్ష్యము వహించి దినగండము దీర్ఘాయుస్సుగా జీవించుట సామాన్య వ్యక్తిత్వము గాదు. అంతరంగమున త్యాగయ్య సాధించినది రామభక్తియోగము. దానికి బహిరంగమైన యావిష్కారము నాదయోగము. కవిత్వ మీ రెంటిని గూర్చుకొండి వంటిది. త్యాగయ్య సాహిత్య రచన వీని మధ్య లోఁబడి నలిగిపోయినది. పిత్రార్జితముగ వచ్చిన యతని గానాభిరుచికి శొంఠి వెంకటరమణయ్యగారి దోహదమును లభించెను. అతఁడు మహా విద్వాంసుఁడు. వాగ్గేయకారుఁడు. తంజావూరు దర్బారులో నుగాది పండుగనాడు మొదట కచేరీసేయు-గౌరవమును సంపాదించికొన్న దొడ్డవాఁడు. మహారాజుతో బాటర సింహాసనముపైఁగూర్చుండు గౌరవముగూడ వారి కుండెడిదట' ఆ మహా విద్వాంసుని శిష్యుయును-యీ శిష్యునకుఁజాలలేదు. రామకృష్ణానందస్వామియే వచ్చి-నారద మంత్రోపదేశమిచ్చి, యుపాసన జేయించెను. తత్ఫలముగా 'నారద గురుస్వామి' దర్శనమైనది. ఇట్లు-త్యాగయ్య సంగీతము మనుష్య లోక పరిధులను గడచి-దివ్యత్వమున కెదిగినది. తరువాత గొన్ని దినములకు-శొంఠి వెంకటరమణయ్యగారే శిష్యుని బిలిపించి-తన యింటఁగచేరీ చేయించినారు. తనకు మహారాజులు బహుమానముగా నిచ్చిన 'తోడా, మకరకంఠి' మొదలైనవానితో శిష్యునలంకరించి-కనులు చల్లగాఁజూచిరట! ఈరీతి 'శిష్యాదిచ్ఛేత్పరాజయ'మన్న యుదార వాక్యమున కుదాహరణమైన యా మహనీయుఁడెంతటి ధన్యుఁడో!

త్యాగయ్య నాద రచన-భాషా రచనమును జాలదూరము మీరిపోయినది. అనేక చోటుల నాదమనెడు జీవమునకు భాష శరీరముగ మాత్రమే నిలిచినది. కొన్ని చోట్లఁబైపై వేషముగ మారినదియుగద్దు. రామోపాసనమునకు సాధనముగాఁదీసికొన్న నాద యోగము-గడకు రామ స్వరూపమేయైపోయినది. అందుకే—



**ఆరభి-రూపకము**

॥ నాదసుధా రసంబిలను నరాకృతాయ మనస ॥నా॥

॥ వేదపురాణాగమ శాస్త్రాదుల కాధారమౌ ॥నా॥

॥ స్వరములు యారొక ఘంటలు
వర రాగము కోదండము
దురనయ దేశ్యము త్రిగుణము
నిరతగతి శరమురా!
సరస సంగతి సందర్భము గలగిరములురా
ధరభజనే భాగ్యమురా-త్యాగరాజు సేవించు ॥నా॥

అని స్థిరీకరించినాఁడు. రామునిలోఁదానారోపించి ధ్యానించిన యఖండత -అమేయత -అనిర్వచనీయత-యీనాద ప్రపంచమందే - త్యాగయ్య కనుభవములోనికి వచ్చినవి. మరియొక రీతిలో దీనిని జెప్పినచో-సంగీతము భక్తియొక్క యెల్లలను దాటిపోయినది.

"నీ భక్తి భాగ్యసుధానిధి నీదేదే జన్మము"

యీ పల్లవిలో నేమున్నది? కాని-దానిని నాల్గువైపులనుబట్టి యాడించు సంగతులు దీనికి ప్రాణము; పది రీతులుగా దీనికి సంగతులు వేసికొన్నప్పుడు-పది భావములు గడ్డకు వచ్చును. శక్తి యున్నవారు వేయిగూడ వేసికొనవచ్చును. కొందఱు సంగతులువేయు పద్ధతి త్యాగరాజు కల్పించినది కాదనియు దరువాతి వారేర్పాటు జేసికొన్నారయు నందురు. ఇది వ్యర్థ వాదము. ఇదియే నిజమైనచో-త్యాగరాజుమనకిచ్చినదేమియును లేదు. త్యాగయ్య సమర్పించిన సంగీతము-మనుష్యులకే యొసఁగిన యాస్తి. అతఁడు తెలుఁగువాఁడని-రామభక్తుఁడని-బ్రాహ్మణుఁడని-ములకనాడు స్మార్తుఁడని-హెచ్చుగ

నభిమానమునో-యసహ్యమునో ప్రదర్శించుట మన తెలివి తక్కువయే. ఈ పరిధులనుమీరి యనుభవింపదగిన దాతని యనర్ఘనాదోపాసన. అతఁడు కర్ణాటక సంగీతమునకిచ్చిన మహాసంపద-జాతిమతముల ధర్మ సంబద్ధమై-సంకుచితమైనదిగాదు. అది మనుష్యులది; మనుష్య ధర్మమునకు సంబంధించినది; అనేక ద్వేషములతో-నడ్డుగోడలతో-నుద్రేకములతో దేశము క్రుళ్ళిపోవుచున్నది. ఈ తరుణములో త్యాగయ్య గానకళను-పరస్పర స్నేహ సౌహార్దములకుపయోగించికొన్నచో మనము ధన్యులమగుదుము.

ఆతని భక్తి వైయక్తికము, కవిత్వము దెలుఁగువానికి మాత్రమే జెందినది. కాని-త్యాగయ్య సాధించిన 'నాదసుధ' మనుష్యజాతినే దరింపఁజేయునది. "బాగుగ వింతరాగముల నాలాపన జేయుచు - మేనుపులకరించు" నపుడింక ద్వేషములకు జోటేది? త్యాగయ్య దృష్టిలో "స్వరలయంబు లెఱుఁగనివారు శిలాత్ములు." ఘననయ రాగములులేని దీపారాధన నూనె ఖర్చు. "ఆగమచరుని శ్రీరాగమునఁబాడుట" యొక పండుగ. అతఁడు తన రాముని "రాగరత్నమాలికచే" నలంకరించికొన్నాఁడు. త్యాగయ్యగారి దృష్టిలో—

"రాగము-తాళము-రక్తి-భక్తి జ్ఞానము
యోగము మరి యనురాగము లేని
భాగవతు-లుదరశయనులు".

అతడు సంగీతశాస్త్ర విధేయుఁడైనను-కేవల క్షుద్రదృష్టికలవాఁడు గాఁడు. రమణీయమైనచో నూత్నతనుగూడ నాహ్వానించు నుదారమైన మనస్సాతనిది. ఆనాఁడు-తంజావూరి సంస్థానాధీశులు



'యూరోపియన్' బ్యాండును ప్రోత్సహించి వినుచుండిరి. దానిచే నాకృష్టుడై త్యాగయ్య బంగాళా రాగమున నొక కీర్తనఁబాడెను. ఈ రాగమున నా 'బ్యాండు' మట్టుల, పోలికయున్నది. సుపోషిణీ రాగమున 'రమించు వారెవరురా' యను నింకొక కృతియుఁగలదు.

త్యాగరాజు పూర్వులెన్నఁడు తమిళ దేశముఁజేరిరో తెలియదు. వృత్తికై యా దేశము నాశ్రయించినను-యింటి భాష మాత్రము దెనుఁగై యుండును. కాని-చుట్టును తమిళమే. దాని ప్రభావముతో నా తెనుఁగు-తలయును దోకయును మారినది. త్యాగరాజునకు ముందున్న తాళ్ళపాక వారందరాంధ్రులే. వారే తొల్తటి వాగ్గేయకారులు. ఆ తరువాత కన్నడిగలు. 'తిరుప్పుకళ్', 'తిరుప్పావై' మొదలగునవి తమిళములోనున్నను వాని కెక్కువ ప్రచారము రాలేదేమో! లేక-నాయక రాజులతో దెన్గున కదృష్టము పట్టెనో? కారణమేదైనను సంగీతములోఁదెనుఁగునకే ప్రథమాసనమైనది. భాషా స్వభావము గూడ గొంత గారణము. పరిపాటిని-చొరవను అనుసరించి, త్యాగయ్య తెనుఁగులో రచన మొదలుపెట్టెను. రచన సేయుటకుఁగావలసిన యోగ్యతలు జాలవర కాతనికున్నవి. చిన్నతనమునుండి యెన్నియో పద్యములు పాటలు విన్నాఁడు. గట్టిజేసికొన్నాఁడు; అమృతభాండమైన పోతన్న భాగవతము చేతికి జిక్కినది. రచించవలెనన్న యుత్సాహమున్న వాఁడగుటచే యతిప్రాసల నొదిగించికొను నైపుణ్యమును సంపాదించికొన్నాఁడు. బ్రదుకులో-భావములలోఁగృత్రిమత లేదు; మనస్సులో నున్న దే మాటలలో వచ్చును. అగుటచే రచనలో దీప్తి యెక్కువ. తన యిష్టము వచ్చినట్లు వ్యవహరించుటకుఁగావలసిన-ధైర్య స్వాతంత్ర్యములు ప్రబలములుగా నున్నవి. తత్ఫలముగా-భాషలో నొక ధారాళత-తీంద్రయుఁజోటు చేసికొన్నవి. కాని-యాతనికి-భాషకుగాని-భావ

ములకుగాని లోతుపాతులు సవరించికొనుట కవకాశములేదు. నాలుగైదు తరములనుండి తెనుఁగుతోడి సాక్షాత్సంబంధముపోయినది. శబ్దార్థములకున్న యొద్దికను గమనించి వాడుటలోని చాకచక్యము మసకబట్టినది దీనితో త్యాగయ్య భాష-యెన్నో యందచందములను బోగొట్టికొన్నది. అతఁడు వ్యాకరణ శృంఖములన్నిటిని ఛేదించికొన్నాఁడు. తు.చ. దప్పక వ్యాకరణ నియమములననుసరించెడువాఁడు-పండితుఁడు గావచ్చును. పదకర్త గాలేఁడు. వాగ్గేయకారులకు వ్యాకరణము చుక్కెదురు. అందరును-వ్యాకరణము నుల్లంఘించినవారే. ఉల్లంఘింపవలెను గూడ. నాద తాళముల స్వభావమట్టిది. వారికేగాదు. సృజనాత్మక ప్రతిభను వ్యాకరణరంధ్రములో దూర్చుట-కుంజరయూథమును దోమకుత్తుకలో దూర్చుట వంటిదె; సూత్రబంధితమైన భాష-దన ప్రవాహ నిత్యత్వమును గోల్పోవును. త్యాగయ్య వ్యాకరణమును గాదన్నందుకు సంతోషమే. కాని-యా నియమోల్లంఘనము-సహజముగ-సరసముగ జరిగినదికాదు. ఎక్కడబట్టినను-దీని కుదాహరణములు జిక్కును. ఆతనిలో ననేకములు తమిళ సంప్రదాయములు గూడఁజేరికొన్నవి.

నౌకా చరిత్రలో

"వెలకు దీసిన వలపురాదుగాక
వెలదులనిక నమ్మరాదు" అని యున్నది.

"తీసిన" అను శబ్దము "కొన్న" అనునర్థములో వాడబడినది.

"నీ సొమ్ము నే నడుగలేదు, నిందు
మోసమౌ ప్రపంచమందాస లేదు"

"పైది 'రొంబ మోసం' బాపతు,

"మును
వెలిసిన భక్తులకే నీ శక్తియు సెల్లనై పోయెనో!

"ఖర్చయిపోయినదా"యని యర్థము.



"తప్పు పనులు లేకయుండె" అనుట తెనుఁగు సరిగా రాని యరవల తెనుఁగు.

"ఉదారి, నీదయను దాచరాదు, ద
రిదాపు లేకను సదా మొరలిడ, వి
నదా చెవులు, ఎవరుదా బ్రోతురిక!
సదా శివహితే, ముదాన సతతము"

పై చరణములోని 'యెవరు దా బ్రోతురు' అనునది 'వాడు దా వోయెను' అనునదే! 'వినదా చెవులు' అనునదియుఁ దమిళము వారి తెలుఁగే, "చెవులు—యెవరు" అనుచోట విసంధి, అల్లే 'బుధ్యానుచు' బుధ్యాని' యిత్యాదులు; చాల నిదానికి బుధ్యాఘన తోచలేదు. అని మరియొక విచిత్రమైన ప్రయోగము. 'భక్త్యనే' అనుమాటయుఁ జాలసార్లు వచ్చును. 'నిజధారులు' నిదానరూప' రత్నసొమ్ములు-జనచెలిమి 'నేరకోటులు-నిర్జర తరువిరులు యిత్యాది వైరి సమాసములకు లెక్కయేలేదు. వీని నన్నిఁటిని సమర్థించుటకు గింజుకొను పిచ్చి వాఖ్యాతలు గూడ కొందరీ నడుమ బయలుదేరినారు. వారు పడు నవస్థను జూచి మనకు జాలి గలుగును. వీరెంత ప్రయత్నించినను త్యాగయ్య, నన్నయ తిక్కన్నల కోవలోఁ జేరఁడు. ఈ శనైశ్చరుల పాలికి త్యాగరాజే జిక్కినాడే పాపము!, ఆయనకు రామదర్శనమైనను ప్రారబ్ధక్షయము గాలేదా! యని నాకొకచే చింత, అరవిందుల కాంధ్రాను వాదకులు జిక్కినట్లు.

ఒక్కొక్కసారి త్యాగయ్యకు పదసమూహమును గూడ గమనించుతీరిక యుండదా యనిపించును. నౌకా చరిత్రలో 'సంకోజముతో వెతజెందుచు నని యున్నది. 'జోగొట్టి' యను ప్రయోగము

గూడ నాతని శైలిలో దూసికొని పోయినది. చిన్ననాఁడు నాకీ క్రింది కృతి పాఠమైనది.

కన్నడ గౌళ-దేశాది

ప ॥ఓరజూపు చూచేది న్యాయమా!
ఓ రఘూత్తమా! నీ వంటి వానికి ॥ఓ॥

అను ॥ నీరజాక్షమును నీ దాసులకు
నీ కేటి వావులు దెల్పవే ॥ఓ॥

చర ॥ మానమించుకైనా నీకు తోచకా
పోయ్నవైన మేమి పుణ్య రూపమా!
దీన రక్షకా! శ్రితమానవా! సం
తాన గానలోల! త్యాగరాజనుత ॥ఓ॥

"పోయ్న" అనునది సరియైన రూపము గాదని యందరెఱుఁగుదురు. ఈ నడుమ దీనినిఁ గొందఱు 'పోయినవైనమేమి' అని దిద్ది పాడుచున్నారు. అపుడు ప్రాసనియమము తప్పుచున్నది గదా! పైఁగా 'పుణ్య రూపమా!' అను దానితో యతి గూడ నడుకదు. 'పోయ్న' అన్నను ప్రాస తప్పినట్లే గదా! యని కఠిన లాక్షణికులు ప్రశ్నింతురు. అంత లాక్షణికత త్యాగయ్యకు గాబట్టలేదు. ఆకృతిఁబాడుకొను మాకును గా బట్టలేదు. 'పోయ్న' యనుదానిని 'పోయిన' అని దిద్దినపుడు తాళము కుంటువడును. మా అవస్థ యింతే. ఇట్లే యీ నడుమ దెనుఁగు వ్యాకరణమును నేర్చిన మహానుభావులు వారి శక్తి కొలది తప్పులు దిద్దుటకు యత్నించుచున్నారు. నౌకా చరిత్రలో 'ఓడ' కు 'వాడ' యని త్యాగయ్య పలుమారు ప్రయోగించెను.



తమిళ దేశమున వ్యవహార మట్లే యుండును. పరిష్కర్తలు 'ఓడ' యని దిద్దుటకు ప్రయత్నించిరి. వీరికీ ప్రయాస యెందుకో! మరి?

"ఓడను జరిపే ముచ్చట గనరే! వనితలార! నేఁడు
ఓడలో రంధ్రము కలిగె, యీ వనితల కెవ్వరు నలిగె"

— పై రెండు చోటులను 'వాడ' - 'ఓడ' యైనచో యతికి దుర్గతియే.

ఒక్కొక్కసారి త్యాగయ్యలో నంత్య ప్రాసలు పచ్చును. చాలచోట్ల కర్ణపేయముగనే యుండును. కర్ణారుంతుదములైనవి యును నక్కడక్కడ గనిపించును.

"రామ నామము సేయ సిగ్గా! కారా
దేమి పల్కవు పుంటి బుగ్గా!
భామలకడ దాటకు మంకెు జగా!
పామర తనువు నమ్మకు నీర్బుగ్గా!

-సార సారకాంతార చరమ దవి
దార! సుందరాకార! సుగుణసుకు
మార! మారమణ! నీరజాప్తకుల
పారావార! సుధారస పూర"

—పై రచన జేసిన త్యాగరాజేనా "నీరు బుగ్గా", పుంటిబుగ్గా" యన్నదని మన కాశ్చర్యము కలుగును.

ఒకొక్కక చోట 'రంగడా విభీషణునకు పంగనామ మిడినరీతి' యిత్యాదులైన భాల భావములు గూడ నాతనిలోఁ గనిపించును. చెప్పఁదలఁచిన భావములు స్పష్టముగ, సరళముగఁ జెప్పుటకుఁగా వలసిన యొరోప్ప-సేరోప్ప లేక ఛందస్సు ముగిసిన జాలునని సాఁగి

ములకుగాని లోతుపాతులు సవరించికొనుట కవకాశములేదు. నాలుగైదు తరములనుండి తెనుఁగుతోడి సాక్షాత్సంబంధముపోయినది. శబ్దార్థములకున్న యొద్దికను గమనించి వాడుటలోని చాకచక్యము మసకబట్టినది దీనితో త్యాగయ్య భాష-యెన్నో యందచందములను బోగొట్టికొన్నది. అతఁడు వ్యాకరణ శృంఖములన్నిటిని ఛేదించికొన్నాఁడు. తు.చ. దప్పక వ్యాకరణ నియమములననుసరించెడువాఁడు-పండితుఁడు గావచ్చును. పదకర్త గాలేఁడు. వాగ్గేయకారులకు వ్యాకరణము చుక్కెదురు. అందరును-వ్యాకరణమునుల్లంఘించినవారే. ఉల్లంఘింపవలెను గూడ. నాద తాళముల స్వభావమట్టిది. వారికేగాదు. సృజనాత్మక ప్రతిభను వ్యాకరణరంధ్రములో దూర్చుట-కుంజరయూథమును దోమకుత్తుకలో దూర్చుట వంటిదె; సూత్రబంధితమైన భాష-దన ప్రవాహ నిత్యత్వమును గోల్పోవును. త్యాగయ్య వ్యాకరణమును గాదన్నందుకు సంతోషమే. కాని-యా నియమోల్లంఘనము-సహజముగ-సరసముగ జరిగినదికాదు. ఎక్కడబట్టినను-దీని కుదాహరణములు జిక్కును. ఆతనిలో ననేకములు తమిళ సంప్రదాయములు గూడఁజేరికొన్నవి.

నౌకా చరిత్రలో

"వెలకు దీసిన వలపురాదుగాక
వెలదులనిక నమ్మరాదు" అని యున్నది.
"తీసిన" అను శబ్దము "కొన్న" అనునర్థములో వాడ బడినది.

"నీ సొమ్ము నే నడుగలేదు, నిందు
మోసమౌ ప్రపంచమందాస లేదు"
"పైది 'రొంబ మోసం' బాపతు,
"మును
వెలసిన భక్తులకే నీ శక్తియు చెల్లనై పోయెనో!
"ఖర్చైపోయినదా" యని యర్థము.



"తప్పు పనులు లేకయుండె" అనుట తెనుఁగు సరిగా రాని యరవల తెనుఁగు.

"ఉదారి, నీదయను దాచరాదు, ద
రిదాపు లేకను సదా మొరలిడ, వి
నదా చెవులు, ఎవరుదా బ్రోతురిక!
సదా శివహితే, ముదాన సతతము"

పై చరణములోని 'యెవరు దా బ్రోతురు' అనునది 'వాడు దావోయెను' అనునదే! 'వినదా చెవులు' అనునదియుఁ దమిళము వారి తెలుఁగే, "చెవులు—యెవరు" అనుచోట విసంధి, అట్లే 'బుధ్యనుచు' బుధ్యని' యిత్యాదులు; చాల నిదానికి బుధ్యాఘన తోచలేదు. అని మరియొక విచిత్రమైన ప్రయోగము. 'భక్త్యనే' అనుమాటయుఁ జాలసార్లు వచ్చును. 'నిజధారులు' నిదానరూప' రత్నసొమ్ములు-జనచెలిమి 'నేరకోటులు-నిర్జర తరువిరులు యిత్యాదివైరి సమాసములకు లెక్కయేలేదు. వీని నన్నిఁటిని సమర్థించుటకు గింజుకొను పిచ్చి వాఖ్యాతలు గూడ కొందరీ నడుమ బయలుదేరినారు. వారు పడు నవస్థను జూచి మనకు జాలి గలుగును. వీరెంత ప్రయత్నించినను త్యాగయ్య, నన్నయ తిక్కన్నల కోవలోఁ జేరఁడు. ఈ శనైశ్చరుల పాలికీ త్యాగరాజే జిక్కినాడే పాపము!, ఆయనకు రామదర్శనమైనను ప్రారబ్ధక్షయము గాలేదా! యని నాకొకటే చింత, అరవిందుల కాంధ్రాను వాదకులు జిక్కినట్లు.

ఒక్కొక్కసారి త్యాగయ్యకు పదసమూహమును గూడ గమనించుతీరిక యుండఁదా యనిపించును. నౌకా చరిత్రలో 'సంకోజముతో వెతజెందుచు నని యున్నది. 'జోగొట్టి' యను ప్రయోగము

వరదయ్య — క్షేత్రయ్య యగు వేళకు నాట్యము తోడి సావాసము పూనుకొనెనేమో! కృష్ణోన్మాదిమైన యాతనికిఁ బదకల్పనమే కంత దష్నమైన యానందము నిచ్చెనో! చెప్పలేము. ఒకసారి గోలకొండ పాదుషా యెదుట, మరియొక వాగ్గేయకారునితో క్షేత్రయ్యకు వాదువచ్చెనట! ఆ సన్నివేశ మీ క్రిందిది.

"వేడుకతో నడచుకొన్న—విటరాయడే
ఏడుమూడు తరాలనుండి-యెందునా గాని యెవతె
కూడుకొని మువ్వగోపాలుడు-కృపగల్గినా విభుడు ॥వేడుక॥

॥మధుర తిరుమలేంద్రుడు-మంచి బహుమాన మొసగి
యెదుట గూర్చుండుమని-యెన్నిన యిమ్మనెనే
యిదిగో! రెండువేల పదము-లిపుడెంచుకొమ్మనిన
చదురుమీదనే నున్న సామికి-సంతోషమింతింత గాదె ॥వేడుక॥

॥ఆళిమీర తంజాపురి నెలకొన్న విజయరాఘవుని
వెలయ మనుజుల వెంబడి —వేగమె పొడగాంచి
చలువ చప్పరమున నుండగ-చక్కగ వేయి పదముల
పలుకరించుకోగానె-బహుమాన మిచ్చె నా వేళ ॥వే॥

॥బలవంతుఁడై గోలకొండ పాదుషా బహుమాన మిచ్చి
తులసి మూర్తితో వాదుదలచెనా వేళ
వెలయ మువ్వగోపాలుఁడు వెయ్యిన్నె నూరుపదములు
నలువది దినములలోన—నన్ను గలిసి వినుపించెనే ॥వేడుక॥

—పై పదములోని లెక్కనుబట్టి యాతఁడు చెప్పినవి దాదాపైదు వేలు. లెక్కకురాని వెన్నియో! కనుక నాకాలమున క్షేత్రయ్యకు నర్తకునిగా కంటె పదకర్తగానే పేరు వచ్చి నటులున్నది.



"రఘునాథ" భూపాలునకు క్షేత్రయ్యపైన మితమైన గౌరవము. ఆ సభలో నున్న శబ్దార్థభుక్కుల కీవాలకము రుచింపలేదు. క్షేత్రయ్య రచనలు రసగుటికలు. వ్యాకరణాది నియమముల మేరను మీరినవి. "రావే! పోవే!" యని గ్రామ్యములో పాటల్లి కొను వానికింత గౌరవమేమి? యని వారు గుసగుస లాడిరి. అతని పేరే క్షేత్రయ్య. ఆతనికొక రాజు దగ్గర కొలువేమున్నది? మఱునాడు కొల్వులో నొక పదము పాడినాఁడు, అదియిది.

**కాంభోజి-త్రిపుట**

॥వదరక పోపోవే! వాడేల వచ్చేని! వద్దు రావద్దనవే!
అది యొక్క యుగము. వేరే జన్మమిపుడు.
అతడెవ్వరో! నేనెవ్వరో! ఓ చెలియా!
॥వదర॥

॥నిచ్చనిచ్చలు నేడే వచ్చేని, రేపైన వచ్చేననుచు మదిలో
నిచ్చగా బలువేడి నిట్టూర్పులచేత-నింతిరో పెదవులెండి
హెచ్చైన వెన్నెల చిచ్చుల రాత్రుల
యెన్నెన్నో గడపితినిక నేటి మాటలే!
॥వదర॥

॥వలపు కాడిదేకదా! వచ్చుననుచు దెరు-వులు జూచి వేసారితి.
నెలలెంచియలసితి, నిలుపరాని ప్రేమ-నెమ్మది నడచుకొంటి
కలకండ శుకనాదములు వించు మధుమాస
ములు గడపితీ వట్టి ముచ్చటలిక నేలే!
॥వదర॥

॥భామరో! శకునమునలడిగితి, మువ్వ గోపాలుడు వచ్చుననుచు
కామించి నాథులగలయు చెలులజూచి, కరగి చింత నొందితి-

దీని కడపటి చరణములు చెప్పలేదు. అందుచే-పదము-ముక్తాయింపు లేని మద్దెల వరుసవలె నున్నది. తాను రామేశ్వర యాత్రకుఁబోదు

పోయిన రచన లెన్నియో త్యాగరాజులో నున్నవి. అందుచేఁ
గొన్ని కీర్తనల యర్థమింకను నాకాశఖడ్గచ్ఛాలనమే. త్యాగయ్య
రచన సరిగానే యుండి యుండుననియు నీ దోసఁగు లన్నియుఁ
దెలుఁగు దెలియని యాతని శిష్యప్రశిష్యులు గావించినవనియు నొక
వాదము. ఇది కొంత మటుకు నిజమే కావచ్చును. కాని
యిందులోఁ ద్యాగరాజు భాగమును జాలవఱకుండునని
నా తలంపు. ఆతనిది తోచినది తోచినట్లుగా వెల్వడు నాశు కవిత.
గాయనుల సంగీత రచన యున్నట్లు. రాగము, తానము, పల్లవి,
స్వరకల్పన యిత్యాది కర్ణాటక సంగీత స్వతంత్ర రచనలలో, గాయ
కుఁడు ముందు గట్టిచేసిన పాఠమెక్కడికిని జాలదు. తన యదృష్ట
మును నమ్మి 'దేవుడా! నీవే దిక్కు' అని యాతఁడు ముందునకు
దూకును. ఈ సాహసములో ప్రతిభావంతుడైన, సుశిక్షితుఁడైన
గాయకుని నోటినుండి యతఁడు గాని, మనము గాని, యెన్నడు
కలలోనైన నూహించికొనని యపూర్వ, అద్భుత రచనలు బయట
పడును. ఆ ప్రయత్నములో నపస్వరము లెన్నోదొరల వచ్చును.
రాగవలయమును దప్పిన ఛాయలెన్నియోఁ జేరి కొనవచ్చును.
వాని నన్నిటిని మనము సహించుకొనవలెను. ఆ కళా స్వభావ
మట్టిది గాబట్టి: పట్టునకు సులభముగా జిక్కని నాదకాలముల నుండి
సూక్ష్మ సూక్ష్మతరములైన భావములను సృష్టించు విద్యయిది. కాని
సంకేతబద్ధములైన వాగర్థముల నాశ్రయించిన కవితా కళ యాపద్ధతి
ననుసరింప వలసిన పనిలేదు. స్ఫురించిన భావమును నిమ్మళముగా
నాలోచించుకొన వచ్చును. ఆవిష్కరణమున రూపురేఖలు దీర్చికొన
వచ్చును. శబ్దముచేనర్థమునకు, అర్థముచే శబ్దమునకుగాంత్యతిశయము
కల్పించికొనవచ్చును. ఆయవకాశముకవితారచనకున్నది. ఉండవలెను
గూడ. అందుకే'నిలుకడవలయుగృతికి' అన్నారుపెద్దలు.ఆశుకవితలో
నప్పుడప్పుడద్భుతములైన కల్పనలు ఒకటి రెండు రావచ్చును.
కాని కవి యనిపించుకొనుటకా మాత్రము చాలదు. చాలరాదు.



త్యాగరాజు కవిత యీ యాశుపద్ధతికి జేరినది. అద్భుతమని
పించు నొకటి రెండు భావములున్నను అఖండత చాలనివి. కనుకఁ
దెనుగులో నితర మహాకవుల రచనలను రుచిచూచిన వారికి త్యాగ
య్యలోఁ గవిత్వమును వెదకుట పేరాసమాత్రమే. అక్కడక్కడఁ
గొన్ని చక్కని లోకోక్తులు—సామెతలు నాతఁడు వాడును. వాడి
నవి చాలచోట్ల మట్టసముగ నదికి యుండుటయుఁ గద్దు. కాని
యాతని కవితకంటె యాతని నాదోపాసన ప్రపంచమునకు గొప్ప
దీవెన. ఇచ్చిన దానితోఁ దృప్తి పడక, కవితా సింహాసనమునగూడఁ
నాతని నెక్కించి, యభిషేకించుటకు మనకుఁ బట్టుదల యున్నను—
ద్యాగయ్యకే యిష్టముండదేమో!!.

త్యాగయ్య సంగీతమునకు మూలపురుషుడు గాఁడు; కాని
తనతోనే గానము మొదలైనంతగాఁ బ్రకాశించిన మహాపురుషుడు.
అట్టి వాఁడే నాట్యమునకు క్షేత్రయ్య గూడ. అతనిది కూచపూడి
దగ్గర నున్న "మువ్వ" యందురు. అక్కడి బ్రాహ్మణులకు- ఒక
శాఖకు మాత్రము నేటికిని చిన్ననాఁటే ముక్కుగుట్టి గోపాలుని
గుడిలో నాలుగడుగులైనను వేయింతురట! కూచిపూడి వాఁడగుటచే
వరదయ్యకు నాట్యము వచ్చియుండునని మనమనుకొనవలెనంతే.
ఆతఁడే సభలో గాని యాడినట్లు 'దాఖలా' లేదు. ఏ యంతఃపుర
స్త్రీలకైనను నాట్యము నేర్పినట్లు గూడలేదు; కర్ణాటరాజుల యాఁ
స్థానములలో బయకారులుండిరి. అది 'యుభయకార' శబ్దభవము,
నాట్యమాడి యాడించువారిని బయకారులను చుండిరి. రాయల
కాలములోని 'బయకార రామప్ప' ప్రసిద్ధుడు. దేశము తమిళమైనను
రఘునాథరాయఁడు, విజయరాఘవుఁడు మొదలైన వారి యాస్థాన
ములలోఁ జెల్లుచుండినవి కర్ణాటరాజమర్యాదలే. వారిక్కడ నుండి
వలస వెళ్ళినవారే. క్షేత్రయ్యకు "నాట్య-వృత్తి" యున్నచో
వారెన్నడో 'బయకార క్షేత్రయ్య' యని దగిలించి యుండురు.

వరదయ్య — క్షేత్రయ్య యగు వేళకు నాట్యము తోడి సావాసము మానుకొనెనేమో! కృష్ణోన్మాదియైన యాతనికిఁ బదకల్పనమే కంత దఘ్నమైన యానందము నిచ్చెనో! చెప్పలేము. ఒకసారి గోలకొండ పాదుషా యెదుట, మరియొక వాగ్గేయకారునితో క్షేత్రయ్యకు వాదువచ్చెనట! ఆ సన్నివేశ మీ క్రిందిది.

"వేడుకతో నడచుకొన్న—విటరాయడే
ఏడుమూడు తరాలనుండి-యెందునా గాని యెవతె
కూడుకొని మువ్వగోపాలుడు-కృపగల్గినా విభుడు ॥వేడుక॥

॥మధుర తిరుమలేంద్రుడు-మంచి బహుమాన మొసగి
యెదుట గూర్చుండుమని-యెన్నిన యిమ్మనెనే
యిదిగో! రెండువేల పదము-లిపుడెంచుకొమ్మనిన
చదురుమీదనే నున్నసామికి-సంతోషమింతింత గాదె ॥వేడుక॥

॥ఆళిమీర తంజాపురి నెలకొన్న విజయరాఘవుని
వెలయ మనుజుల వెంబడి —వేగమె పొడగాంచి
చలువ చప్పరమున నుండగ-చక్కగ వేయి పదముల
పలుకరించుకోగానె-బహుమాన మిచ్చె నా వేళ ॥వే॥

॥బలవంతుఁడై గోలకొండ పాదుషా బహుమాన మిచ్చి
తులసి మూర్తితో వాదుదలచెనా వేళ
వెలయ మువ్వగోపాలుఁడు వెయ్యిన్నె నూరుపదములు
నలువది దినములలోన—నన్ను గలిసి వినుపించెనే ॥వేడుక॥

—పై పదములోని లెక్కనుబట్టి యాతఁడు చెప్పినవి దాదాపైదు వేలు. లెక్కకురాని వెన్నియో! కనుక నాకాలమున క్షేత్రయ్యకు నర్తకునిగా కంటె పదకర్తగానే పేరు వచ్చి నటులున్నది.



"రఘునాథ" భూపాలునకు క్షేత్రయ్యపైన మితమైన గౌరవము. ఆ సభలో నున్న శబ్దార్థభుక్కుల కీవాలకము రుచింపలేదు. క్షేత్రయ్య రచనలు రసగుటికలు. వ్యాకరణాది నియమముల మేరను మీరినవి. "రావే! పోవే!" యని గ్రామ్యములో పాటలల్లి కొను వానికింత గౌరవమేమి? యని వారు గుసగుస లాడిరి. అతని పేరే క్షేత్రయ్య. ఆతనికొక రాజు దగ్గర కొలువేమున్నది? మఱునాడు కొల్వులో నొక పదము పాడినాడు, అదియిది.

**కాంభోజి-త్రిపుట**

॥ వదరక పోపోవే! వాడేల వచ్చెని! వద్దు రావద్దనవే!
అది యొక్క యుగము. వేరే జన్మమిపుడు.
అతడెవ్వరో! నేనెవ్వరో! ఓ చెలియా! ॥వదర॥

॥ నిచ్చనిచ్చలు నేడే వచ్చెని, రేపైన వచ్చెననుచు మదిలో
నిచ్చగా బలువేడి నిట్టూర్పులచేత-నింతిరో పెదవులెండి
హెచ్చైన వెన్నెల చిచ్చుల రాత్రుల
యెన్నెన్నో గడపితినిక నేటి మాటలే! ॥వదర॥

॥ వలపు కాడిదేకదా! వచ్చుననుచు దెరు-వులు జూచి వేసారితి.
నెలలెంచియలసితి, నిలుపరాని ప్రేమ-నెమ్మది నడచుకొంటి
కలకండ శుకనాదములు వించు మధుమాస
ములు గడపితీ వట్టి ముచ్చటలిక నేలే! ॥వదర॥

॥ భామరో! శకునమునలడిగితి, మువ్వ గోపాలుడు వచ్చుననుచు
కామించి నాథులగలయు చెలులజూచి, కరగి చింత నొందితి-

దీని కడపటి చరణములు చెప్పలేదు. అందుచే-పదము-ముక్తాయింపు లేని మద్దెల వరుసవలె నున్నది. తాను రామేశ్వర యాత్రకుఁబోదు

ననియు-క్రింది చరణములు పండితులు పూరింపవలెననియుఁ జెప్పి క్షేత్రయ్య వెళ్ళినాఁడు. చాల దినములవఱకుఁ దిరిగి రాలేదు. పాట నెవ్వరు ముగింతురు? ఆ రసికత పాండిత్యమున కందునదిగాదు. పరస్పరము జేతులు బిసికికొనుచున్నారు. క్షేత్రయ్య తిరిగి వచ్చెను. పదము ముగిసినదేదీ! పండితుల మొగములపై రక్తపుఁజుక్క లేదు. అప్పుడాతడు—

॥ రామ! రామ యీమేని తోనిక వాని
మోము జూడవలెనా! మొదటి పొందే చాలు ॥వదర॥

అని యా పాటకుఁ గోటీరము వెట్టినాఁడు. దానితో నా పండితుల సద్దణగినది. క్షేత్రయ్య నాట్యమాడెనో లేదోగాని-దానియందలి మెలఁకువలన్నియు-నాతఁడెఱుఁగును. కీర్తనను రచించునపుడు-త్యాగయ్య హృదయములో ధాతువువలె-క్షేత్రయ్య మనసులో నాట్యసంకేతములు మసలును. అందుచే నాతని పదములు నాట్యమునకు మట్టసముగా నదుకును. నాట్యాభినయమునందు బదములేగాక స్వరజతులు, పదవర్ణములు, కృతులు, కీర్తనలు, జావళీలు, తరంగములు, అష్టపదులు, దరువులు, తిల్లానాలు మొదలగు వానిని వాడుదురు. శ్యామాశాస్త్రి ప్రభృతులు స్వరజతులు వ్రాసినారు. వానిలో పల్లవి అనుపల్లవియుండును. క్షేత్రయ్య పదములలో ననుపల్లవి యుండుటయు లేకపోవుటయుఁగద్దు. తిల్లానాలలో స్వరము, జతులు, సాహిత్యము పర్యాయముగా వచ్చును. నాట్యాభినయమున కుపయోగించు పదసాహిత్యములో 'శబ్ద'మను జాతి యొకటి యున్నది. తమిళులు వీనిని 'కౌతము'లందురు. పదునేడు పదునెనిమిదవ శతాబ్దములలోఁ దెనుగుఁ దేశమునుండి దక్షిణమునకుఁ దరలిపోయిన యాంధ్రులు వీనిని రచించిరి. తమిళులు గూడ వీనినే వాడికొన్నారు. వీనిలోఁ బ్రధాన రసములు భక్తి శృంగారములు. శబ్ద ప్రయోగమునకు, సాహిత్యమునకు, రసమునకు ననుగుణమైన యే భాగము



నైనను శబ్దములలో నుపయోగింపవచ్చును. దశావతార 'శబ్దము'లో నొకటి మచ్చునకు

తద్దీను, తదినుత, తహాత, తహాత, తిత్తిహత్త,
ఝుంతరి, తరితరి, తధణాకిణ, తకిటకిట, తధాణాతరి
తాకుఝుకు, తకిఝుంకు, తణక, హమికిగల
సోమకాసురుని బట్టి కొట్టి వేదములు దెచ్చితివా!
మత్స్యావతారా! జై! మత్స్యావతారా!

ఇట్లే పది యవతారములకు నున్నవి. రాజులపై వ్రాసినవియు గొన్ని గలవు. 'సలామ్ సలామ్' అని కడపట వచ్చును. వానిని 'సల్లాము'లందురు. సంగీతము నాదకాలముల భాషయైనట్లే నృత్యము మరియొక భాష. దీనిని నాట్య, నృత్య, నృత్తములని ముత్తెఱఁగులుగా విభాగించిరి. నాట్యమనఁగా నాటకములకు సంబంధించినది. రసభావ ప్రధానమైనది నృత్యము. రాగ తాళ ప్రధానము నృత్తము; ఈ మూఁడును మఱల రెండు రీతులుగ విభాగింపఁబడినవి. సుకుమార భావాశ్రయమై స్త్రీలచేఁ బ్రయుక్తమై శృంగారాదుల బోషించు నృత్యము 'లాస్యము'. ఉద్ధత భావాశ్రయమై పురుషులచే నాచరింపఁబడునది 'నృత్తము'. రౌద్ర భీభత్సాదులనిది ప్రదర్శించును. కంఠముతో గానమొనర్తురు. ఇది వాచికాభినయము. ఆ యభినయముయొక్క యర్థము హస్తములచే వివరింపఁబడును. దానిలోని భావముఁ గనులచే సూచింతురు. పాదములతో దాళము పోషింతురు. ఇది స్థూలముగా నాట్యముయొక్క పద్ధతి. హస్తము చేత నర్థమును జూపించుటకు ముద్రలుపయోగింతురు; భాషవలె నిదియు నొక సంకేతము. ఈ ముద్రలను వారి వారి సంప్రదాయము ననుసరించి భిన్నములుగా నుండును, అన్నిటికిని శాస్త్రమొక్కటే; కాని కాల దేశములననుసరించి చిన్న మార్పులు; కొన్ని యక్షరములను సూచించుటకుఁ దంజావూరు సంప్రదాయమునఁ బట్టు ముద్ర

వేఱు; కథాకళిలోఁబ్రదర్శించు ముద్ర భిన్నము; కూచిపూడి సంప్ర
దాయపు ముద్ర వేఱొకటి; ఒక సంప్రదాయము గొంత తెలిసిన
తర్వాత వేరు దానిని గమనించుటంత కష్టమేమియుఁగాదు;
అసంయుత ముద్రలు గొన్ని. అనఁగా-నొక హస్తముచే మాత్రమే
యర్థమును బోధించునవి; సంయుత హస్తములు వేఱు; రెండు హస్త
ములతో ముద్రలుపట్టి యర్థమును సూచించునవి; మిశ్రమ ముద్రలు
గూడ గొన్ని గలవు. ఇంతవఱకును-హస్తములకు సంబంధించిన విష
యము. ఇఁక దక్కిన యంగాభినయములో నంగములు-ప్రత్యంగ
ములు-ఉపాంగములున్నవి; తల, పార్శ్వములు, నడుము మొదలైన
వంగములు; భుజములు మూపులు మొదలైనవి ప్రత్యంగములు,
రెప్పలు, గ్రుడ్లు-చెక్కిళ్లు మొదలైన వుపాంగములు; ఇట్లే గ్రీవా
భేదములును; అనఁగా మెడను ద్రిప్పుటయందలి గొన్ని పద్ధతులు;
భ్రూవిక్షేపములు మఱికొన్ని; స్థానక భేదములు వేఱు. సంగీతమువలె
నిదియు నొక శాస్త్రము; గానముయొక్క మూలపదార్థములు
దెలిసికొననిది సంగీతమర్థముగాదుగదా! అట్లే నాట్యమూల తత్వము
లనుగూర్చి గొంతయైనను దెలియనివాని పాలికి నాట్యము వెట్టి
గంతులుగా నుండును; శబ్దార్థముల రమ్యత దెలియక గవిత్వమర్థము
గానట్లు. కాని యనేకులు దమ యధికారమును గమనింపకయే యీ
కళను దప్పుపట్టుదురు; తామేమియు బరిశ్రమింపగూడదు; అన్నిఁ
టినిఁదమ నోటిముందుకుఁదెచ్చి పెట్టవలెను. హోటళ్ళలో ఫలహారము
వలె. ఇందలి న్యాయమేమో వారి దివ్య చిత్తములకే రావలెను.
"కూచిపూడి"కి నాట్యముతో సంబంధము "కృష్ణలీలా తరంగిణి"తో
నేర్పడినది. పదునైదవ శతాబ్దినాటికే కూచిపూడివారు నాట్యములో
ప్రసిద్ధులు. 1502నాటి "మాచుపల్లి కైఫియతు"లో నిట్లున్నది.



అప్పుడు సిద్ధవటము సీమను సమ్మెట నరసరాజు పాలించుచుండెను.
"ఆయన ప్రజలవద్ద ద్రవ్యాకర్షణ చేసేయెడల త్వరగా సొమ్ము
యివ్వకపోతే స్త్రీలను తీసుకవచ్చి స్తనాలకు చిఱుతలు పట్టించే
వాఁడు." "అప్పుడు కూచిపూడి బ్రాహ్మణులు భాగవతులనే వేష
ధారులు కీర్తన నిమిత్తమై యీ స్థలానకు వచ్చిరి." "సమ్మెట
గురవరాజుయొక్క దారుణ ప్రభుత్వము చూచినారు. వారక్కడ
నుండి లేచిపోయి విజయనగరము జేరిరి. నాటి ప్రభువు వీరనరసింహ
రాయలు. కూచిపూడివాండ్లు చాల విద్యావంతులని ప్రసిద్ధియందు
న్నందున రాయలవారు స్త్రీలుసహా చూడవలెనని నగర్లవద్ద దివా
ణములో కీర్తనకు సెలవు యిచ్చినారు" "కీర్తన చేసేటప్పుడు ఒక
భాగవతుఁడు సమ్మెట గురవరాజు వేషం వేసుకొని స్త్రీలయొక్క
స్తనాలకు చిఱుతలు పట్టించి సొమ్ము యివ్వమని తహాస్సీలు చేసి
నాడు" అప్పుడు రాయలవారు అదేమని యడిగి భాగవతుల
ముఖతః వర్తమానము తెలిసి తెల్లవారి ఆ స్థానమునకు వచ్చి
మొహింకు సైన్యము సిద్ధము చేయించమని సెలవు యిచ్చినారు.
"ఆ మొహిం గురవరాజు తల తెస్తున్నానని ప్రతిజ్ఞ చేసి" కోట
ముట్టడించెను. గురవరాజు తల తెచ్చి ప్రతిజ్ఞ తీర్చికొన్నాడు. కనుక
కూచిపూడి భాగవతులు నాట్య కలాపమునందు కీర్తివిస్తారులగుటయే
గాదు. వారి నాట్య కౌశలమును దేశ క్షేమమునకై వినియోగించు
చుండిరి; వాస్తవిక జీవన పరిస్థితులను ప్రభువుల కెఱిగించుటయందు
ప్రజలకును ప్రభుత్వమునకును మధ్య వారు వ్యవహార శాఖోద్యో
గులుగా నుండి ప్రజా క్షేమమునకుఁదోడ్పడుచుండిరి. వారి దేశాభి
మాన మట్టిది. వారి శీలమాకొలందులది.

క్షేత్రయ్యది చక్కని దేశీయమైన రచన. అతని తెలుఁగు

నును అచ్చమైనవి. కృతకపులైన పదములకందు చోటేలేదు. ఎక్కడో చిన్న చిన్న సంస్కృత పదములున్నను నవి తెనుఁగులో నణఁగి పోయియుండును. క్షేత్రయ్య పదములలోఁబల్లవితో బారంబమైనరాగము క్రమక్రమముగా నభివృద్ధియగుచుఁ బోవును. రాగతాళములలో నాతఁడు చాల దగ్గఱకుఁ దీసికొన్నది రాగమే. తాళము దానికంగముగాఁ దిన్నగా నడచుచుండును. త్రిపుట జంపె-చాపు, మొదలైన, సులభమైన తాళములు దప్ప క్లిష్టమైన తాళముల జోలి కాతఁడు పోలేదు. అట తాళములో నొకటి రెండు మాత్రము కనపడుచున్నవి. తాళములోని చమత్కారములకును కాలిమువ్వలకును పొత్తుగుదురదు. క్షేత్రయ్య పదము లన్నియు విలంబకాలమందే గానము చేయఁదగినవి. పదము యొక్క యర్థమును అభినయముతో జూపింపవలెను గదా! సంగీతమందెంత కొద్దిగా భాష యున్న నంత క్షేమము. పదకవితా శిల్పమందట్లు గాదు. ఇందు భాషా రచనయే ప్రధానము. రాగ తాళముల యందలి లయ లామూర్తి కలంకారములు మాత్రమే. పద్యకవితలో రాగతాళ లయలు శూన్యప్రాయముగా నుండును. పదరచనలో వాని స్వరూపము గొంత స్పష్టముగా మన మనస్సున కందును. రెంటికిని భేదమింతే, కనుక పద్యకవితను జూచినట్లు పదకవితను జూడరాదు. పైఁగా నాట్యమునకుఁబనికి వచ్చు పదకవితలో నాంగికాభినయమునకుఁ జోటిచ్చుపదములకే కూర్పుండవలెను. కేవల పదముతో రసోత్పాదనము - నాట్యము యొక్క యుద్దేశముగాదు. ఆ పదార్థమును - దానిలోని భావమును బట్టి చూపించవలెను గదా! అనఁగా నాట్యమునకుఁ బనికివచ్చు పదముల సాహిత్యము సామాన్య పదసాహిత్యముకంటె గొంత భిన్నముగా నుండునని నా యభిప్రాయము. క్షేత్రయ్య పదము లన్నియు దొరికినంత వఱకు సంభాషణా రూపములే, అప్పుడే యాంగికాభినయమునకుఁ జక్కని చోటుండును. ఆ సంభాషణములలోను మగ వారి



భాషణములపై క్షేత్రయ్య కంత మక్కువ లేదు. ఏదో యొక్కటి రెండు మాత్రమే కనఁబడుచున్నవి.

**మధ్యమావతి - చాపు**

॥ వలచిన వాడనే నీ మీద చాల
కులుకులాడి ! మువ్వగోపాలుడనే భామ ॥వల॥

॥ నిను బాసి కంటికి నిద్దుర రాదు
నిమిషమైన గాని ప్రొద్దు పోదు.
యెనసిన మరుబారి కోర్వగ రాదు
యిక నా తమి నిలుప వశము గాదు వల॥

॥ బాళినెంతో తరుణి యీవేళ
తాళలేను నాపై దయ దాచిన మేల;
చాల నన్ను కరుణించి లీలనేలు కొమ్మంటే నీజాగు లేల ॥వల॥

॥ ఏ పట్లదయలేక యిటువలెనీవు-పావజాతిమరునిపాలు జేసేవు
కోపగించి నెనరు గొసరిన రావు
కొమ్మ ! మువ్వగోపాలుడని కౌగిలీవు ॥వల॥

—యిట్టివి; నిజమే. మగవాడు లాస్యము జేయ నారంభించినచో నండ మేమి యుండును ? అభినయమున కంతగా నవకాశ మివ్వని పాటలు గూడ నొకటి రెండు క్షేత్రయ్యలోఁ గనబడును. నా దృష్టిలో నాతని ప్రసిద్ధమైన

**మోహన - ఝంప**

॥ మగువ తన కేళికా - మందిరము వెడలెన్
వగకాడ మాకంచి వరద తెల్లి వారెననుచు ॥

॥ విడజారు గొజ్జంగి విరిదండ జడతోను
కడుచిక్కు బడిపెనగు - కంట సరి తోను
నిడుద కన్నులు దేరు - నిదుర మబ్బుతోను
తొడరి పదయుగమున - దడబడెడు నడతోను ॥మగు॥

॥ సొగసి సొలయని వలపు - సొలపు జూపుల తోను
వగవగల ఘనసార - వాసనల తోను
జిగిమించు కెమ్మోవి - చిగురు కెంపుల తోను
సగము కుచముల విదియ - చందురులతోను ॥మగు॥

॥ తరి తీపుసేయు సమ సురతి బడలిక తోను
జరుత పావడ చెఱగు - జారైవ్రట తోను
యిరుగడల కైదండ - విచ్చు తరుణుల తోను
పరమాత్మ ! మువ్వ గోపాల : తెల్లవారెననుచు ॥మగు॥

—అనెడు పద మట్టది. ఇందులో నాయిక సామాన్యాభిసారిక. కంచి వరదునితో రాత్రి గడపి తెల్లవారెనని యామె తిరిగివచ్చు వాలకమును వర్ణించుచున్నాఁడు. దీనిలో విడబాఱు గొజ్జంగి విరిదండ జడ 'చిక్కుబడిపెనఁగు కంటసరి' ఘనసార వాసనలు "జారైవ్రట" మొదలగునవి వస్తువులు. స్త్రీపాత్ర వీనిని యొకవేళ ముద్రలతో బట్టి చూపించినను మనకు రసస్ఫూర్తి యేర్పడదు. ఇట్టి రచనలను జూచియే కొంత కాలమైన వెనుక క్షేత్రయ్యకు నాట్యముతో సంబంధము వదలెనేమో యన్నాను. క్షేత్రయ్య పైన యీవరకెన్నియో విమర్శలు ఆలంకారిక దృష్టితో వచ్చినవి. అతనిలోని సంగీతమును పూజ్యులు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు - బాలాంత్రపు రజనీకాంతరావు రుచిజూపుటకు ప్రయత్నించినారు. క్షేత్రయ్య పదములను దేశమునకు సంపాదించి పెట్టిన ధన్యజీవి విస్సా అప్పారావుగారు.



వారి కృషి యెంతయో యభినందింపఁదగినది. ఇప్పటికీ వ్రాత చాల పెరిగినది. క్షేత్రయ్యపైన నాదృష్టిలో ప్రత్యేకముగ నొక వ్యాసము వ్రాయఁదగినది.

పై రచనలో నే నెందరి యభిప్రాయములనో పేకరించినాను. మావైపు 'తనది కొంత తాళ్లపాక వారిది కొంత' యను సామెత యున్నది. ఇందున్నదంతయుఁ దాళ్ళపాక వారిదే. తనది లేనే లేదన వచ్చును.

---

16-11-2012